76

ఫిబ్రవరి 1978

# సృజన

సృజన
మాసపత్రిక
హనుమకొండ,
వరంగల్-506 001

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

మళ్ళీ వస్తున్నాయి మన ఊరికి
చిలక పలుకుల డేగలు
రక్తం తాగే రాబందుల మూకలు
ఉషస్సులారా మనస్సులారా జాగ్రత్త
పాపలారా కనుపాపలారా జాగ్రత్త

— చెరబండరాజు

స్వయంగా వస్తున్నారు
పేగులమీద ఆకలిగోళ్ళ రక్కుల్ని చూపెట్టండి
భయమెందుకు -
వీధివీధినా వీళ్ళు చేసిన
దోపిడీల తోరణాలు వేళ్ళాడ గట్టండి

— ఎస్. మౌలాలి

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయిలు    ఈ సంచిక రు. 1–50 పైసలు

## ఈ సంచికలో....



---


SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J.P.N. Road, Warangal - 506 002 (A.P.)
Working Editor: Varavararao

# ఎన్నికల ఎండమావులు

ఇందిరాగాంధీ హయాంలో, ముఖ్యంగా ఎమర్జెన్సీలో కాంగ్రెస్ నిరంకుశ పాలన ఫాసిజం స్థాయికి వెళ్ళింది. ఎన్నడూ స్వేఛ్ఛ, పౌరహక్కులు నోచుకోని కార్మిక కర్షక వర్గాలతోపాటు ఇతరవర్గాలు, చివరకు పాలకవర్గంలోని కొన్ని సెక్షన్స్ కూడ ఎమర్జెన్సీ ఇనుప కౌగిలిలో నలిగిపోయాయి. అందువల్ల స్వేఛ్ఛ, ప్రజాస్వామ్యం అనే మాటలే చాలు ఎవరు ఉచ్చరిస్తే వాళ్ళే బలాదుర్ అయిపోయారు.

ఇంతచేస్తే నియంత ఇందిర ఇంకా 'ఎమర్జెన్సీ'ని సమర్థిస్తూ సజావుగా బలహీన వర్గాల ప్రజలలో భ్రమలుపోషిస్తూ తిరుగగలుగుతూనేవున్నది. విక్రమార్కుని సింహాసనం ఎక్కితే చాలు వెర్రివాడుకూడ వేదాంతం పలుకుతాడన్నట్లు రఘురామయ్యలూ, రంగా రెడ్లూ, చొక్కారావులూ జనతాపార్టీలో చేరి ఎమర్జెన్సీ అత్యాచారాల స్వీయచరిత్రలను కలంపోటుతో రద్దు చేసుకున్నారు. ఇందిరతో షరీకుకాని నేర్పరితనంవల్ల చరణ్ సింగ్ కాళ్ళదగ్గరేమెచ్చి, కోటలోనే పాగాపేసాడు వెంగళరావు. దానితో పది సంవత్సరాల జలగం ఫాసిస్టు పాలన, ప్రజలపై ప్రజా కార్యకర్తలపై ఆయన పదేళ్లగా కొనసాగిస్తున్న అత్యాచారాలు, హత్యాకాండలు ఇందిర నేరాల్లో భాగం కాకుండా పోయాయి.

అందుకే నరహంతకుడు వెంగళరావు గద్దె దిగకుండానే, ఎన్‌కౌంటర్ల పేరిట జరిగిన వందలాది నక్సలైట్ల హత్యలపై విచారణ తొలిమొగ్గలో వుండగానే, రాజకీయ ఖైదీలు విడుదల కాకుండానే, విప్లవ రచయితలపై, విద్యార్థులపై, విప్లవకారులపై తప్పుడుకేసులు రద్దు కాకుండానే, రాష్ట్రంలోకెల్లా అగ్రగణ్యుడైన ముద్దాయి స్వయంగా ఎన్నికలు నిర్వహిస్తున్నాడు. కాంగ్రెస్‌తో ముడిపేసుకున్న సిపిఐ, జనతాతో జతచేరిన సిపిఎం, ఇంకా ఇతర పార్లమెంటరీ పార్టీలు సరేసరి. తగుదునమ్మ అని తాము రంగంలో దిగారు, విప్లవపార్టీలు గ్రూపులుగా చెప్పుకునే కొందరు.

ఈ ఎన్నికలు ఒక సూత్రబద్ధత, ఒక నీతి, నియమం లేకుండా జరుగుతున్న ఒక పేలం పాట. కులము, డబ్బు, జులుం, బలం— ఈ ఎన్నికల అసలు రంగూ హంగూ. కార్మిక-కర్షక, ప్రజాతంత్ర శక్తుల పోరాట పటిమను పక్కదారి పట్టించి మరి కొంతకాలం వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని వాయిదా వేయడమే ఇందులో దాగిన దగా, దగుల్బాజీతనం.

ఈ ఎన్నికల బూటకాన్ని బట్టబయలుచేస్తూ వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని మరింతశక్తివంతంగా ముందుకు తీసుకపోవడమొక్కటే ఈనాడు ప్రజాతంత్రవాదుల ముందున్న ప్రధాన కర్తవ్యం.

— సంపాదకుడు

## ఎలెక్షన్ హర్రాజ్

ఎన్నికల సంబరమిది
ఉన్నవాళ్ళ పండగ
ఎక్కడెక్కడో దాగిన
దొంగ డబ్బు బయటికొచ్చి
జల్సా చేసే సమయం
ఎలెక్షన్ల సమయం

కార్లు వేనవేలు తిరుగు
బార్ల విందులెన్నో జరుగు.
దొరలూ కోటేశ్వరులూ,
వాళ్ళది మోచేతి గంజి
తాగువాళ్ళు
హడావిడిగ తిరుగురోజు
పోటీపడి వెలుగురోజు
ఎన్నికల సంబరమిది
ఉన్నవాళ్ళ పండగ

చిలకల్లా పలుకులతో
పేదాళ్ళను మోసగించి
మెరుపులవలె భ్రమలు జల్లి
నిజమని మైమరపించి
లాలించి మురిపించి
తాగించి కొనివేసి
తమపబ్బం గడుపుకొనే
ఉన్నవాళ్ళ ఉత్సవమున
ఇంద్రజాల ప్రదర్శనం.

ధనవంతుల రాజ్యం ఇది
ఇదే ప్రజల రాజ్యమనీ
ప్రజలందరు తమకు తాము
ఎంచుకొన్న ప్రభుత్వమని
ప్రజలది ఆమోదముద్ర
పొందు మహా దుర్దిన మిది.
ఎన్నికల సమయమిది
ఉన్నవాళ్ళ సందడి ఇది.

ఇంకింతగ మరింతగా
పీడించగ లైసెన్సును
పీడకులకు పీడితులతో
ఇప్పించే తతంగమిది
ప్రజలను దోపిడి చేసుకు
తినుకోసం మనుకోసం
ఐదు ఏళ్ళ కంట్రాక్టుకు
ఉన్నవాళ్ళు పోటీపడు
హరాజిది
ఎలెక్షన్ల సంబరమిది.

— ఏ. ఆర్.

# దండు

చమన్‌లాల్ ప్రిభాకర్ (పంజాబీ కవి)

దూరం నుంచి
బుర్రు బుర్రున వేగంగా చప్పుడు
నా అలసత్వం నుంచి అదిరిపడి లేచాను
బహుశా వాళ్లొచ్చినట్లున్నారు—
నిన్న రాత్రి నుంచే
వాళ్ళ గురించి చాలా చర్చ వింటున్నాను

నేను రోడ్డు ఒడ్డున గ్రామంలో కూర్చున్నాను
ఊరు.... ఒక్క ఇల్లూ మిగలని ఊరు
ఊరు.... ఇంకా ప్రాణంపోసుకోని ఊరు

ఓహో ఇది దండు - జాతర
చాలా పొడుగైన దండు
పొడవైనవీ పొట్టివీ
అందమైనవీ అసంఖ్యాకమైనవీ కార్లు
కార్ల వెనుక లెక్కలేనన్ని జీపులు
కార్లలో కూర్చుని
గవర్నరూ మంత్రీ అధికారీ
జీపులో కూర్చుని
ఎందరో గుమస్తాలు
ఈ కార్లూ ఈ జీపులూ ఏ మార్గం నుంచి వస్తున్నాయని!
సడకుమీంచి విమానాలు పోయినట్లుగా.
నేను హైరానయిపోయాను
ఈ దండు
ఎక్కడి నుంచి వచ్చిందీ ఎక్కడకు పోయిందీ

గ్రామంలో తిని కూర్చున్నవాళ్ళు చేసిన
గాయాలతో, వాళ్ళు సృష్టించిన మృత్యువుతో
ప్రజలు దెబ్బతిని వున్నారు— అని విన్నాను నేను
అందుకే బతికిన మానవుల గాయాలకు
ఏదైనా చికిత్స చేయాలనుకున్నాను నేను

నేనుత్తేజితుణ్ణయి రోడ్డుమీద పోతున్న దండును చూస్తూవున్నాను
అందులో
మానవ ముఖాలేమైనా కనిపిస్తాయేమోనని ప్రయత్నంచేస్తూవున్నాను
కాని,
ఆ దండు ప్రయాణమే ఎట్లున్నదంటే
రోడ్డు నాల్గువైపులా దుమ్మే దుమ్ము నిండిపోయింది
నా కన్నుల్లో కొన్ని క్షణాలు చీకటి తెరలు కమ్మినవి
దుమ్ము తుడుచుకుని చూద్దును గదా
ఆ గ్రామంలో ఉత్తేజితుణ్ణయినవాణ్ని నేనొక్కణ్ణే

గ్రామంలో ప్రజలందరూ
తమ తమ గుడిసెలు సదురుకోవడంలో నిమగ్నమయ్యారు
ఎవ్వరూ ఆ దుమ్ము నిండిన సడకు వైపుకు కన్నెత్తి చూళ్ళేదు
బహుశా
ఇటువంటి దుమ్ము వాళ్లు చాలాసార్లు చూసి వుంటారు
అందుకే తమ కళ్ళను ఈ దుమ్ము నుండి కాపాడుకోటానికి
వాళ్ళు ఈ రోడ్డు వైపు చూడడమే మానేశారు
అః! వాళ్లు నన్ను చూశారు
సానుభూతి నిండిన చూపులతో
నేను వాళ్ళ కొరకు సానుభూతి తీసుకొని వచ్చాను
నా సానుభూతి వాళ్ళకోసం నేలలో పేర్లూనికొని వున్నది—

(అను: రేగులపాటి మాధవరావు)

# ఆమె ఈ దేశాన్ని ప్రేమించింది

ఐదు సంవత్సరాల క్రితం నేను జైల్లో కాలు పెట్టిన రోజున, తోటి రాజకీయ ఖైదీ నాతో "ఇది జైలు. ఇక్కడ సూర్యోదయం కనిపించదు; సూర్యాస్తమయమూ కనిపించదు" అన్నాడు విషాదంగా.

"పర్వాలేదు. చూడగలిగితే, ఎల్లవేళలా ప్రకాశించే సూర్యులు జైల్లో చాలా మంది ఉంటారు" అన్నాను నవ్వుతూ.

మేరీ టేలర్ అలాంటి "జైలు సూరీడు". (ఆమెను "జైలు చందమామ" అనటం నా కిష్టంలేదు.)

ఒక ఆశయంకోసం జైలు పాలైన వాళ్లల్లో కొందరు, జైల్లో తమ ఆశయాల్ని మరింత పదిలపరచుకుంటారు. జీవితాల్ని పదును పెట్టుకుంటారు. సమరోత్సాహంతో ఆకాశపుటంచుల్లో డేగల్లా చంక్రమణం చేస్తారు.

మరి కొందరు జైల్లోకి రాగానే ఆశయాల్ని భూస్థాపితంచేసి, శవాల్లా మిగిలి పోతారు. కొక్కెరి తెగులు తగిలిన కోడిపెట్టల్లా ముసగతీసుకపోతారు.

మేరీ టేలర్ వీరిలో మొదటికోవకు చెందింది.

మేరీ టేలర్ బ్రిటిష్ దేశస్తురాలు. స్కూల్ టీచర్. కార్మికవర్గ విప్లవ రాజకీయాలతో ప్రభావితమైంది. 1967 లో నక్సల్‌బరీ రైతాంగ విప్లవం గురించి లండన్ పత్రికల్లో చదివింది. భారత దేశంలో విప్లవ విజయం యొక్క ప్రపంచ ప్రాముఖ్యత ఆమెకు తెలుసు.

1970 లో విప్లవ భారతాన్ని, మిత్రుడు అమలేందును చూద్దామని వచ్చింది. ఇద్దరి ఆశయా ఆదర్శాలూ ఒక్కటే కాగా ఆమె అమలేందును పెళ్లిచేసుకుంది.

మేరీ టేలర్ పోరాటంలోవున్న భారతదేశాన్ని వదిలి వెళ్లలేకపోయింది. పల్లె సీమల్ని చూస్తే తప్ప భారతదేశాన్ని చూసినట్లు కాదని భావించింది.

బెంగాల్-బీహార్ సరిహద్దుల్లో, జెమ్‌షెడ్‌పూర్‌కు దగ్గరలో, సింగ్‌భూమ్ జిల్లాలో ఒక గ్రామానికి వెళ్లినరోజునే మేరీటేలర్‌ను, అమలేందును, అతని తమ్ముడిని పోలీసులు అరెస్టు చేశారు. మరికొంతమందితో కలిపి వాళ్లమీద రాజద్రోహ, దేశ ద్రోహ, హత్యా నేరాలను ప్రభుత్వం బనాయించింది.

హజారీబాగ్ జయిల్లో కొంతకాలం, జమ్‌షెడ్‌పూర్ జెయిల్లో స్వల్ప కాలం– మొత్తం ఐదు సంవత్సరాలు ఆమె జైలు జీవితం అనుభవించింది– ఆ అనుభవాలతో "భారతదేశంలో నా జైలు జీవితం" అనే పుస్తకాన్ని ఇంగ్లీషులో వ్రాసింది.

ఆమె జైలు జీవితం బయటి జీవితం యొక్క కొనసాగింపు మాత్రమే.

పోరాటం లేనిదే మనుగడ లేదనే వాస్తవం జైలు జీవితంలో మరింత సత్యం.

జైళ్లు నరక కూపాలు– అక్కడ పచ్చి బఠానీలు, పుర్రుబెల్లం 'టిఫిన్'– రాళ్లు, ఊక కలిపిన అన్నం, పచ్చటి చారు నీళ్లు, గంటిలో వేసి వండిన పులుసులోని కుళ్లిన కాయగూర ముక్కలు– ఇదీ ఆహారం. "ఆడవాళ్లూ, పిల్లలూ ఉచ్చ గబ్బులో, కుళ్లిన ఆహార పదార్థాల కంపులో, జోరీగల రొదలో, చెమటలు కక్కే ఒళ్లతో, పుళ్లతో, రోగాలతో రోజులు వెళ్లమారుస్తారు– వానకు తడుస్తారు– ఎండ ఎండుతారు– చలికి వణుకుతారు– జెయిలు అధికారుల, వాళ్ల కాకారాయుళ్ల దుర్మార్గాలకు బలైపోతారు.

ఈ దుర్భర పరిస్థితులకు వ్యతిరేకంగా మేరీటేలర్, అవకాశంవున్న మేరకు పోరాటాలు నిర్వహించింది– స్త్రీ ఖైదీల జీవితాలకు ఊరట కలిగించింది.

"మా పరిస్థితులు ఏ కాస్త మెరుగు పర్చుకోవాలన్నా జెయిలు అధికారుల మొండి తనానికీ, వైముఖ్యానికీ, అసమర్థతకీ వ్యతిరేకంగా పోరాడనిదే సాధ్యపడదని మొదటే మేం గ్రహించాం" అని మేరీ టేలర్ వ్రాస్తోంది.

కొండంత భారత దేశాన్ని గోరంత జైలు అద్దంలో ప్రస్ఫుటంగానే చూడ గల్గింది మేరీ టేలర్.

జెయిల్లో దాదాపు స్త్రీలందరూ నిరుపేద రైతు కుటుంబాలకు చెందిన వాళ్లు. పసి వయస్సులో పెళ్లిళ్లు అయిన వాళ్లు– మొగుళ్ళచేత తన్నులు తిన్నవాళ్లు– కష్టం చేయనిదే కడుపు నిండని వాళ్లు– భూస్వాముల ఘోర కలికి గురైనవాళ్లు– దెయ్యాలూ, భూతాలూ, మంత్రగత్తెలు, రాజులు, రాణులు, సవాలక్ష మూఢ విశ్వాసాలు నిండిన ప్రపంచంలో జీవించినవాళ్ళు– ఎక్కువ మంది ఆదివాసులు, అంటరానివాళ్ళు.

ఈ "దగాపడిన చెల్లెళ్ల"తో సమైక్యం కాగల్గింది మేరీటేలర్. వారికి ప్రపంచ విషయాలు చెప్పింది– కొందరికి చదువు నేర్పింది– ఎందరికో సేవచేసింది.

హత్యా నేరంపై జైలుపాలైన, అనంత శక్తిసామర్థ్యాలున్న రైతు యువతి రోహిణి, జెయిల్లో మరుగుదొడ్లు బాగుచేసే సుక్రీ, బొగ్గు గనుల్లో కూలీగా పనిచేసి ఒంటరైన ముసలావిడ బుల్యాఖీ, హిందూ యువకునితో 'లేచిపోయిన' నేరానికి జైలు

జీవితం గడుపుతూ, అందరికీ ఉల్లాసాన్ని పంచే నిత్యసంతోషి ముస్లిం యువతి బిల్‌కిష్, మేరీటేలర్‌ను "పాపా!" అని ముద్దుగా పిలిచే విధవరాలు సోమ్రి- మూగ పిల్లా, "ముసలి గులాబీ" లంగ్డీ బిస్నీయా, పగ్లీమోతీ, పిల్లలు పత్రికాశ్, బొర్రోడు- వీరంతా జెయిల్లో ఆమెకు ఆత్మీయులు- అంతా అనాధలు.

"వాళ్ల విషాదగాధలు వింటున్నకొద్దీ తోటి ఖైదీలకు మా చేతనైన రీతిగా మా సమయం, శక్తి అంకితం చేయకపోతే జైలు జీవితానికి అర్థంలేద"ని ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది.

హజారీబాగ్ జైల్లో కొంతకాలంపాటు మేరీ టేలర్‌కు రాజకీయ నేస్తం కల్పన; జమ్‌షెడ్‌పూర్ జైల్లో రాజకీయ నేస్తం బీనా.

కల్పనది మధ్యతరగతి కుటుంబం. కలకత్తా మురికి వాడల్లో విప్లవ రాజకీయాలను ప్రవేశపెట్టింది. "కష్టాల్లో చిరునవ్వు నవ్వే ఆమె సామర్థ్యం, అన్యాయాన్ని ప్రతిఘటించడానికి ఆమె చూపే సంసిద్ధత" మేరీటేలర్‌ను ముగ్ధురాలిని చేసాయి.

బీనా ద్వారానే భారతదేశ రైతాంగ జీవితాన్ని మేరీటేలర్ ఎక్కువగా తెలుసుకొంది. బీనా భూస్వాముల పొలాల్లో చిన్నతనం నుండి వ్యవసాయ కూలీగా పనిచేసింది- మిడ్నాపూర్ రైతాంగ విప్లవ పోరాటంతో ఆమెకు సంబంధం వుందని పోలీసులు అరెస్ట్ చేశారు- అమానుషమైన చిత్రహింసలకు గురిచేశారు.

వీరంతా ఆమె జైలు చరిత్రకు "చోదక శక్తులు".

ఈ జైలు జీవిత గాధలో "ప్రతికూల పాత్రల"ను కూడా మేరీటేలర్ కళ్ళకు కట్టినట్లుగా చిత్రించింది.

పాతకాలపు సినీమా ప్రొడ్యూసర్‌కు సాహసోపేతుడైన వేటగానికి మధ్యస్తంగా ఉండే పాత్రలాగ కనిపిస్తాడు విలన్ జైలు సూపర్నెంటు; అతని "అనధికార సైన్యం"గా రాజకీయ ఖైదీలపై దౌర్జన్యానికి దిగుతారు జైలు దాదాలు; ఖైదీలనోళ్ళలో దుమ్ముకొట్టి, కడుపుకొట్టి రూకలు పోగుచేసుకుంటారు కొంతమంది జైలు సిబ్బంది.

వీరంతా ఖైదీలను పీక్కుతినే రాబందుల బంధువులు.

కొందరు ఖైదీలకు జెయిలు విశ్రాంతి గృహం- అందులో కొందరికి రకెకపచం- మరికొందరికి రాజకీయాల్లో పైమెట్టుకు ఎగబాకేందుకు జైలు జీవితం ఒక యోగ్యతా పత్రం. వీరంతా పై వర్గాలవారు- సంపన్నులు.

వీళ్ళంతా జెయిలుకు చుట్టం చూపుగా వచ్చి మరుక్షణం వెళ్ళిపోతారు. సాదా ఖైదీలు మాత్రం విచారణ కోసం కళ్ళు కాయలు కాసేటట్లు సంవత్సరాల తరబడి ఎదురుచూస్తూ ఉంటారు.

హజారీబాగ్ జెయిల్లో అవతలి వార్డులోవున్న నక్సలైట్ ఖైదీలు మేరీటేలర్‌కు రక్తంలో రక్తం, ప్రాణంలో ప్రాణం. వారిపై జెయిలు అధికారులు దుర్మార్గంగా కాల్పులు కాల్చినప్పుడూ, జమ్‌షెడ్‌పూర్ జెయిల్లో నక్సలైట్ ఖైదీలపై దారుణంగా లాఠీచార్జి జరిగినప్పుడూ మేరీటేలర్ చలించిపోతుంది. కసిలో పిడికిలి బిగిస్తుంది.

"భారతదేశ భవిష్యత్తు నీతినిజాయితీలున్న ఇటువంటి మంచి మనుషులచేతుల్లో, కుల మత దురభిమానాలులేని ఇటువంటి వాళ్ళ చేతుల్లో, దేశానికి వెన్నెముక లాంటి అట్టడుగు ప్రజానీకంతో సమైక్యమయే ఇటువంటి వాళ్ళ చేతుల్లో వుందని నేనిప్పటికీ భావిస్తాను" అని మేరీ టేలర్ భారత విప్లవకారులకు జేజేలు పలుకుతుంది.

ఖైదీకి ప్రకృతి నేస్తం. "బంధిఖాన నన్ను పూర్తిగా ప్రకృతి నుంచి తెగ్గొట్టి నందుకు నేను కృతజ్ఞురాల్ని" అంటుంది మేరీటేలర్.

ఖైదీలతో కలిసి ఆమె పెంచుకున్న తోటను జెయిలు అధికారులు సర్వనాశనం చేసినప్పుడు "ఆ తోట, ఆ చెట్లు ప్రకృతిలో మమ్మల్ని జతచేసి ఈ చెరసాలబతుకును భరించ గలిగేటట్లు సహాయపడ్డాయి. ఇప్పుడవన్నీ మటుమాయమయాయి" అంటుంది విచారంగా.

జెయిలు జీవితం గడిచేకొద్దీ ఆమెలో సౌందర్య పిపాస అతిశయిస్తుంది. ఆవర ణలో వున్న ఒకేఒక ముద్దబంతి మొక్క వంక తదేకంగా చూస్తూ కూర్చుండిపోయేది. రంగుల బొమ్మలు గీసి గది గోడలు నింపేసేది. అవతలి వార్డులో ఒక ఖైదీ పిల్లనగ్రోవి నుండి పలికించే 'విషాదమయ మధుర రాగాలు' వింటూ తన్మయత్వం చెందేది.

మేరీటేలర్ ఈ గ్రంథాన్ని భారతదేశ సాంఘిక, రాజకీయ పరిశోధనా గ్రం థంగా వ్రాయలేదు. "భారతదేశంలో ఆమె కలిసిమెలిసి సహజీవనం నెరపిన పీడిత వ్యక్తుల ద్వారా ఆమె పొందిన అనుభవాల, పొందుపర్చుకున్న జ్ఞాపకాల సారాంశమే ఈ గ్రంథం" అని మేరీటేలర్ ముందుమాటలో వ్రాసింది. అంతమాత్రంచేత ఆమెకు సాంఘిక, రాజకీయ అభిప్రాయాలు లేవనికాదు. ఈ పుస్తకంలో అవి పలుచోట్ల కనిపిస్తాయి.

ఉదాహరణకు కొన్ని :

చిలీ: చిలీలో సైనిక తిరుగుబాటు జరిగి ప్రజాతంత్ర ప్రభుత్వం పతనమైంది. చిలీలోని రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ఐ.రా.స. తీర్మానించిన సందర్భంలో భారత ప్రభుత్వం గైరుహాజరయింది.

భారతదేశ రాజకీయ ఆర్థికసంక్షోభం: "భారతదేశం సలసలకాగే పెద్ద కాగులా వుంది. ప్రభుత్వం ఇంద్రజాలకునిలాగ అందులోది పైకి పొంగకుండా కదిలిస్తూ, కలుపుతూ, తంటాలు పడుతోంది. కాని కింద మండే నిప్పుల మంటల్ని అది ఆర్ప లేకపోతోంది."

జయప్రకాశ్ ఉద్యమం: జయప్రకాశ్‌నారాయణ్, అతని అనుయాయులు అట్టడుగు ప్రజలకోసం పోరాడలేరు. జయప్రకాశ్ 'సంపూర్ణ విప్లవం', 'వర్గరహిత ప్రజాస్వామ్యం' అనే భావనలు ఆచరణ సాధ్యం కానివి.

భోజ్‌పూర్ రైతాంగ విప్లవపోరాటం: నగ్సలైట్లు అంటరాని వాళ్ళమధ్య భూమి లేని రైతాంగం మధ్య స్థిరంగా పాతుకపోయారు. ప్రజల సహకారాన్ని బాగా పొంద గలుగుతున్నారు.

అణ్వస్త్రప్రయోగం: దేశంలో దరిద్రం తాండవిస్తూవుండగా, భారత ప్రభుత్వం అణ్వస్త్రప్రయోగానికి కోట్లరూపాయలు ఖర్చుపెట్టి ఘనవిజయం సాధించామని గప్పాలు కొడుతోంది.

ఎన్నికలు: ఆర్థికబలంవున్న భూస్వాముల, వడ్డీవ్యాపారుల పలుకుబడి ఎన్నికల్లో నిర్ణాయకశక్తి.

లౌకికరాజ్యం: "మత ప్రమేయంలేని లౌకికరాజ్యంగా భావించబడే భారత దేశంలో కులం తాలూకు మహత్తు రానురాను నాకు బాగా బోధపడింది.... హిందూ వ్యవస్థ నాలుగు కులాలుగా విభజింపబడిందని చదివానే కాని అవి శాఖోపశాఖలుగా చీలి రెండు వేల ఐదు వందల ఉపకులాలుగా, ఉపశాఖలుగా చలామణి అవుతున్నాయని నాకు తెలీదు".

అత్యవసర పరిస్థితి: విప్లవకారులపై చాలాకాలంగా కొనసాగుతున్న అత్యాచారం పొడిగింపూ, విస్తరణ అత్యవసర ప్రకటన. ఎమర్జన్సీ ప్రకటన ఇందిరా ప్రభుత్వ బలాన్ని గాక బలహీనతనే సూచిస్తోంది.

మేరీటేలర్ కలు జీవితానికి 'అజేయమైన ఆశావాదం' చుక్కాని పట్టింది. బ్రిటన్‌లో తల్లి చనిపోయిందన్న విషాదవార్తను ధైర్యంగా ఎదుర్కొంది. అమలేందుతో

వియోగాన్ని నిశ్శబ్దంగా దిగమింగింది. సెన్సార్ కత్తిరవాతపడ్డ పత్రికలను, పుస్తకాలను చదువుతూ, డైరీ వ్రాస్తూ, విప్లవ గీతాలను గొంతెత్తి పాడుతూ, ఖైదీలతలలో నాలుకగా వ్యవహరిస్తూ జైలు కాలాన్ని సద్వినియోగం చేసింది.

ఎమర్జన్సీ ప్రకటించిన కొద్దికాలానికే 'అమ్మగారి ప్రభుత్వం' మేరీటేలర్‌ను విడుదలచేసింది. ఎమర్జన్సీ నియంతృత్వానికి వ్యతిరేకంగా బ్రిటన్‌లో చెలరేగిన గాలి దుమారాన్ని ఎదుర్కోవటానికి ఒక 'ఎర్తుగడ'గా మేరీటేలర్‌ను భారత ప్రభుత్వం విడుదల చేసింది.

జమ్‌షెడ్‌పూర్ జైల్లోపలే నిర్మించిన ప్రత్యేక కోర్టులో (ఆహా!) జడ్జి ఆమె విడుదలను ప్రకటిస్తూ 'హాయిగా వెళ్ళి, సంతోషంగా వుండు' అని అన్నప్పుడు 'ఇంకా ఎంతోమంది విచారణ లేకుండా జైళ్ళల్లో మగ్గుతూవుంటే నేను సంతోషంగా ఎలా వుండగలను' అని ఎదురు ప్రశ్న వేసింది.

భారత ప్రభుత్వం, బ్రిటిష్ కాన్సల్ ఎంత వత్తిడిచేసినా తన విడుదల కోసం నీతిమాలిన ఎలాంటి షరతులను ఆమె అంగీకరించలేదు. తోటి నక్సలైట్ ఖైదీల అనుమతితోనే ఆమె బ్రిటన్‌కు వెళ్ళింది.

"ఇతరులకు తోడ్పడాలనుకున్న వాళ్ళకు ఎండాలేదు- చలీలేదు. స్వకీయమైన సంతోషంలేదు- సంతాపంలేదు." నిజమే- మేరీ టేలర్ అన్ని అవాంతరాలను ధైర్యంగా తట్టుకుంది. అచంచలంగా నిలబడింది.

పుస్తకం చివరిలో మేరీటేలర్ తన 'పొలిటికల్ టెస్టామెంట్'ను ఇలా ప్రకటిస్తోంది:

"నేడు రాజ్యం చేస్తున్న అమానుషత్వాన్ని, అన్యాయాల్ని వ్యతిరేకించి ప్రతిఘటించే వాళ్ళ గొంతు నొక్కేయటానికి యీ ప్రభుత్వం గాని, మరే ప్రభుత్వం గాని కొనసాగించే నిరవధిక నిర్బంధాలు, దారుణ చిత్రహింసలు, స్వేచ్ఛాపహరణలూ భారతదేశపు సమస్యల్ని పరిష్కరించ జాలవు. మొత్తం ప్రజని పురుగుల్లా పరిగణించే ప్రభుత్వం వున్నంతకాలం, ఓ మనిషి చావుకి కారణం ఆకలా- అర్ధాకలా అని ఎడతెగకుండా నిరర్థక చర్చోప చర్చల్లో నిర్దాక్షిణ్యంగా కాలహరణచేస్తూ దమననీతితో రాజ్యమేలుతున్న ప్రభుత్వం సాగుతున్నంతకాలం యీ దేశపు వ్యథ ఆరదు".

విడుదలై ఇంగ్లండుకు తిరిగి వెళ్ళుతూ రైల్లో ప్రయాణంచేస్తున్నప్పుడు బెంగాల్ సుందరతర గ్రామాలను చూస్తూ "నేనీ దేశాన్ని ఎంతగా ప్రేమించానో" అని పదేపదే

మనసం చేసుకుంటుంది. దోపిడీకి, పీడనకు గురవుతూన్న భారత ప్రజల సుఖ సంతోషాలను ఆమె మనసా కాంక్షించింది.

జైల్లో అర్ధరాత్రి గంటలు మోగుతున్న వేళ, ఈ మంచి పుస్తకాన్ని చదివి ముగించిన తరువాత– "అంతర్జాతీయగీతం" అందించిన సముజ్వల సందేశం మరోసారి నాలో ప్రతిధ్వనులు పలికింది. కార్మికవర్గ అంతర్జాతీయతా భావంతో ఉత్తేజితమైన మేరీ టేలర్ భారత విప్లవోద్యమంలో ఎంతగానో తాదాత్మ్యంచెందింది. జాతీయ దురహంకారంతో కళ్ళు మూసుకపోయిన వారికి కార్మికవర్గ అంతర్జాతీయతా సమున్నత గిరిశిఖరాలు కనిపించవు. వారికి మహోన్నత కార్మికవర్గ మానవతాదృక్పథం అవగతంకాదు.

చివరిగా ఈ పుస్తకం అనువాదం గురించి ఒక్క మాట. ఇంగ్లీషు భాషలోని వెలుగు నీడల్ని, "సహవాసి" అద్భుతంగా తెలుగులోకి ప్రొజెక్ట్ చేయగల్గారు. ప్రతి ఫ్రేమ్– కాదు ప్రతి పేజీలోనూ అనువాదకుని పనితనం కనిపిస్తుంది.

ప్రయోజనకరమైన ఈ పుస్తకాన్ని వెలుగులోకి (తెలుగులోకి) తీసుకొనివచ్చిన 'అనుపమ ప్రచురణ' నిర్వాహకులు అభినందనీయులు–

– శివసాగర్

---


**భారతదేశంలో నా జైలు జీవితం – మేరీ టేలర్**

అనువాదం 'సహవాసి' వెల : 6–50

ప్రతులకు : అనుపమ ప్రచురణలు, 10–2–317/33 విజయనగర్ కాలనీ,
హైదరాబాదు–500 028


## జనార్దన్

ములుగు అడవుల్లో నిన్ను
చెట్టుకు కట్టి కాల్చిన ఆ పిరికిపందల
తుపాకి చప్పుడు కాదు
మాకు వినిపించేది
అసువులు బాసే ముందు
నువు చేసిన విప్లవ గర్జన
మాకు శంఖనాదమై వినిపించింది.

– రెడ్‌గార్డ్

కథ :

# మనుషుల వేట

కిరణ్

సూర్యుడు అడివిల కింకిపోయిండు. చెట్లకొసలు ఇంకా ఎరుపురంగుతో మెరుస్తున్నాయి. ఆకాశం విరామ సమయంలోని యుద్ధభూమిలా వుంది. చలనం లేని మేఘాలు క్షతగాత్రుల్లా వున్నాయి.... దూరంగా ఊరు నిద్రిస్తున్నదానిలా వుంది.... ఊళ్లోని జమీందార్లిల్లు పాముతలలాగా ఉంది.

ఊరికి పడమటి వేపు ఆకాశంలోనికి పెరిగిన వృక్షాలు గల అడివి ఉన్నది. అడివినానుకొని పాతకాలపు డాబా ముసలి తనంలో ఉన్నది. డాబా ముందు ఎర్రటి అక్షరాలు గల బోర్డు ఉన్నది. ఆ డాబా ఆ బోర్డు లేకముందు జనాన్ని భయపెట్టింది. ఆ డాబాలో ఎందరో కన్నెపిల్లల వెక్కిళ్లు, ఎదురు తిరగడాలు అందుకు అంతమవడాలు జరిగేది. రాత్రి ముసిరే ఈ మునిమాపు వేళలో అతి తగ్గుస్వరంతో ఆ డాబాలో సంగీతం మోగేది.. ఆ తరువాత గాజుగ్లాసుల్లో ద్రవం కారిన చప్పుడు.... ఆ రోజు పడుచు నలిగిపోవడం వగైరా.... ఇవన్నీ ఆ డాబా పడుచుతనంలో జరిగేవి....

డాబా ముసలిదైపోయి, దాని యజమాని ముసలివాడై పోయి.. ముఖ్యంగా ఆ డాబు దర్పం పోయి వాటి స్థానంలో ఆ డాబా ముందు ఎర్రటి అక్షరాల బోర్డు వెలిసింది. ముసలి వాడైన దాని యజమాని రక్షకబలాలు ఇప్పుడందులో ఆఫీసు పెట్టు కున్నాయి.... అందుకు విధిగా ప్రజలు వాళ్ల జీతబత్తేలు చెల్లిస్తూ ఉంటారు....

సూర్యుడు దిగజారిన ఆ మునిమాపు వేళలో పాత డాబా తన పడుచుతనంలోని హుషారును పుంజుకొంది.... చితికిపోయిన మెట్లమీద బూట్లు టకటకమంటున్నాయి.... డాబాలోపల ఏడవడానికి కూడ స్వాతంత్ర్యంలేని ఓ పడుచు గొంతు ఏడుపును బలవంతంగా అణుచుకున్నా పగిలి ఆ నిర్జన ప్రదేశంలో అతి హృదయవిదారకంగా వినబడుతోంది.

గురువయ్య వరండాలో మెట్ల కానుకొని తుపాకీతో నిల్చున్నాడు. అతని పాత కళ్లద్దాలు దుమ్ముకొట్టుకపోయినయ్.... హడావిడిగా, వచ్చే అధికార్ల బూట్లకు అధికార వందన సమర్పణచేసి బాగా అలిసిపోయిండు.... ఎర్ర దుమ్మును లేపుకుంటూ వచ్చే జీపుల్ని చూసి చూసి విసిగిపోయిండు....

మనుషుల్ని కొట్టడం ద్వారా తృప్తిని పొందదలిచినోళ్లు, హింసద్వారా వినోదం పొందగోరినోళ్లు, ప్రమోషను కావాల్సినోళ్లు, కొట్టడం ప్రాక్టీసు చేయదలుచుకున్నోళ్లు,

క్లులు రాబట్టి తద్వారా దేశసేవ చేయదల్చుకున్నోళ్లు, పట్టీలు, బిరుదులకాశించినోళ్లు—ఎందరో మహానుభావులు, ధీరులు, శూరులు, దేశభక్తులు, మనుషుల వేటలో ఆరితేరిన యోధులు హుటాహుటిన పాతబంగళాను సందర్శించడం బాగానే ఉంది కాని గురువయ్యకు అంతమందికి అధికార వందన సమర్పణ చేయడమే కష్టంగా ఉంది.

ఇంతమంది గొప్పోళ్ల కలయికకు కారణం— ఆనాటి వేటలో మూడు రోజుల నుంచి సరిగా కూడైనా తినని లేతవయసు యువకు లిద్దరు దొరికిండ్రు.... వాళ్లెప్పుడో రోజులుబాగుండి చదువుకున్నప్పుడు మీటింగులుబెట్టి కూలోళ్లగురించి పాటలు పద్యాలు పాడిండ్రట— మొన్న అర్ధరాత్రి ఊరు నిద్దురపోవంగ ముసలి జమీందారు సిరుసును గద్ద తన్నుక పోయిందట.... ఆచూకి కోసం రక్షక బలగాలు వేట ప్రారంభించిండ్రు.

ఆ వేటలో దొరికినయ్ రెండు బక్కబద్ద ఎముకలు తేలిన లేగ పిల్లలు....

గురువయ్య ముసలి మొఖంమీద లేగ పిల్లలు దొరికినందుకు సంతోషం గాని, అంతటి గొప్ప పనిని తన అధికార్లు చేసినందుకు విజయగర్వం గాని లేవు.... అతని మొఖంమీద జీపులు రేపిన ఎర్రటి దుమ్ము, చెమట పేరుకుపోయినయ్. గురువయ్యా, సూర్యుడూ ఒక్కసారే డ్యూటీమీది కెక్కిండ్రు.... సూర్యుని డ్యూటీ అయిపోయినా గురువయ్య డ్యూటీ కాలేదు.

మళ్లీ మెట్లమీద బూట్ల టకటక.... గురువయ్య కుడికాలు బూటు ఎడమకాలు బూటుకు తాకింది. కుడిచేయిబిగుసుకొని నుదుటికి తాకింది. వచ్చిన మీసాల శాల్తీ ఇంత తతంగాన్ని గమనించకుండా డాబా లోపలి కెళ్లిపోయింది.

"అమ్మా.... అమ్మా.... నాకేంతెలియదు సార్!.... అమ్మా...." పాత డాబా లోపలి నుంచి పేడుకుంటున్నదో గొంతు....

"లంజకొడుక.... నీయవ్వ.... ఎరికలే.... లమ్డికొడుకా !.... ఫోర్‌నాట్ త్రీ.... ఫోర్ నాట్ త్రీ— ఉచ్చపట్టుకచ్చి అని నోట్లెపొయ్...." ఎవడో అతి కరుకుగా అరుస్తున్నాడు— ఇంకెవడో గాజుసీసా పగిలినట్టుగ నవ్వుతున్నాడు—

ఆ తరువాత కర్ర మనిషిమాంసంమీద కరుకుగా తాకిన శబ్దం— ఎవడో పెద్ద గొంతుతోటి బండబూతులు నేపథ్యంలో తిడుతున్నాడు— ఇంకెవడో కీచుగొంతుతోటి స్త్రీ జాతిని అనంగరంగ భాషలో తిడుతూ తృప్తిపడుతున్నాడు.

వరండాలో పచారుచేస్తున్న గురువయ్య లోపలజరిగే తతంగానికి అసహ్యంతో, బాధతో, చేతకాని కోపంతో కుతకుతలాడుతున్నాడు.

ఇంతట్లోకే పాత డాబా ముంగటికి సైకిలు వచ్చి ఆగింది. ఆశ్చర్యపోయిన గురువయ్య మొఖంమీద సైకిలుమీద వచ్చిన తురక పిలగాడు భయంభయంగా లోపలి కడుగుపెట్టి, భయాన్ని పులిమిండు. "గర్‌మే హాలత్ ఠీక్ నహిహై.... బచ్చేకు జరం ఎక్కిపోయింది.... అమ్మ నాకి తోలిచ్చింది–" సగం ఉర్దూ సగం తెలుగు కలిపి సైకిలు పిలగాడు చెప్పిన వార్తవిని గురువయ్య భయంభయంగా డాబా లోపలికి నడిచిండు.

లోపల కనిపించిన దృశ్యము చూసి చేష్టలుడిగి నిలబడిపోయిండు.

ఇరువై సంవత్సరాలు నిండని పిలగాని పల్చటి తొడలమీద దున్నపోతులంత దోల్లిద్దరు రోకలి దుడ్లు కాళ్లతో తరుముతున్నరు. ఒకడు గోళ్లల్లో సూదులు గుచ్చుకూ ప్రశ్నిస్తున్నడు. ఇందాక ఆలస్యంగా వచ్చిన మీసాలపోతు తన యిష్టంవచ్చినచోట రూలుకర్రతో పొడుస్తున్నడు. ఇంకో గద్దకండ్లాయన ముఖం ప్రశ్నార్థకంగా పెట్టి వికృతంగా చూస్తున్నడు.

ఎదురుగా ఉన్న గదిలో కటకటాల వెనుక ఇంకో పిలగాడు గోడవేపు ముఖం తిప్పుకొని అయిష్టంగా కదులుతున్నడు.

ఆ పిలగాని ఒళ్లంతా పొంగి కమిలిపోయింది. గోళ్లల్లో నుండి ఎర్రటి రక్తం చిమ్ముతోంది. నేలమీద పడుకున్న అతని తల వెంట్రుకలు గచ్చుకు కొట్టడంవల్ల చెదిరినట్లున్నది. ముక్కుల నుంచి నోట్లో నుంచి కారిన నెత్తురు చెంపల నిండా నిండిపోయింది.

"ఎవడెవడున్నడో చెప్పు?.... చెప్పుతే నీ అరికాలికి ముల్లంటకుంట నేను నిన్ను బయటికి తీస్త– లేకపోతే...." మాట పూర్తిచేయలే గద్దచూపులాయన.

"వాన్ని స్థిమితంగా గూర్చోనియ్యండి– ఒరే ఫోర్‌నాట్.... వాన్ని కూర్చోబెట్టు" ఇంకొకడు.

పిలగాడు కూర్చోలేదు– కింద పడిపోయిండు.

"నాకెరుకలేదు సార్.... నన్ను నమ్మండి సార్!" ఆ పిలగాడు.

— మళ్లీ తతంగం మొదలు—

గురువయ్య కాళ్లు వణికినయ్– అద్దాలు మసకబారి పోయినయ్– గదిలోని ఎలక్ట్రిక్ బల్బు వికృతంగా నవ్వుతున్నట్లనిపించింది....

"సాబ్! గర్‌మే హాలత్ అచ్చానహీహై– బచ్చే...." పదిహేడేండ్ల సర్వీసున్న గురువయ్య పూర్తిమాట మాట్లాడలేని అస్వతంత్రుడు.

"ఐచ్చే లుచ్చే కుచ్ నహి జాన్తే.... సెంట్రీ డ్యూటీ ఎవని పెండ్లాం మిండెడు చెయ్యాలె– జావో ఇధర్‌సే...." గద్దకండ్లాయన అరిచిండు.

గురువయ్య కాళ్లకు పాము చుట్టుకున్నట్లుగ తత్తర పడ్డడు.

"క్యాబే జాగోతం సూత్తున్నవ– సడు" పిసాలకింది నోరు.

గురువయ్య కుడికాలు ఎడమ కాలుకు తాకింది– కుడిచేయి బిగుసుకున్నది– నొసలును తాకింది– పాత గచ్చుమీద బూట్లు కోపంతోటి నడిచినయ్– వరండాలో పక్షి పచారు....

ఆకాశం నల్లబడ్డది.... అడివి నల్లబడ్డది.... దూరంగా ఊరు వీధిలైట్లవెలుగులో మెరిసిపోతోంది తోరణంలాగ– పాత డాబా ముంగటి కరంటు స్తంభంమీద గుడ్లగూబ కూర్చుండి ఏడుస్తోంది– నల్లబడ్డ ఆకాశంలోకి నల్లబడ్డ ముఖంతోటి చూసిండు గురువయ్య– నల్లబడ్డ మనసు తన ఇంటి ఆవరణలో తచ్చాడుతోంది.

మూడు రోజుల నుంచి ఒక్కరోజు సెలవు కోసం వేడుకుంటున్నడు తను. పద్నాల్గేండ్ల కొడుకు మూసిన కన్ను తెరవకుండ టైఫాయిడ్ జ్వరంతోటి మంచంలో మూల్గుతున్నడు.... గవర్నమెంటు డాక్టరు మంచం కాళీలేదని ముఖం మాడ్చిండు. ఆతరువాత కాంపౌండరు అసలు కిటుకు చెప్పేసరికి తను నోరెల్ల బెట్టిండు. సర్కారు దవాఖాన్లో మంచంగావలంటె అయిదునూర్ల రూపాయలు.... గవర్నమెంటు ఉద్యోగంలో ఉండి పదిహేడేండ్లసర్వీసులో అయిదువందల పైసలుకూడ కూడబెట్టలేక పోవడం తన అసమర్థత. పోలీసుద్యోగంలో తనలాంటి వాడు దగడని చేసుకున్న పెండ్లామే తెగేసి చెప్తుంది....

'ఈరోజు హెడ్డు ఇద్దరు పోలీసోల్ల వెంటేసుకొని ఊరి మీదికి షికారెల్లిండు.... పరపతి ఉన్న బుచ్చిరెడ్డి సెలవుపెట్టి తిరుపతికెల్లిండు. వెంకటస్వామికి నోరున్నందుకు, మస్కాకొట్టేనాలికున్నందుకు జీపుల దొరలెంట దిరుగుతండు. మిగిలింది నోరు తెగువ లేని గీ గురువడేనా? ఇగ గురువడు సెంట్రీ డ్యూటీ చేయకుంటె ఇంకెవరు చేసేది? గురువా? నీముద్దుల కుమారుడు మంచంలో చావు కళలో కలువరిస్తుంటాడు.... నీ భార్య దిక్కు తెలియక మంచంకోడు మీద తల ఆన్చి ఏడుస్తుంటది? నీ చిన్నపిల్లలు అన్న మంచంచుట్టు ఏడుస్తూ తిరుగుతుంటరు....నువ్వు డ్యూటీచేస్తున్నావు....డ్యూటీ. సన్నటి తొడలు కనిపించే కాకినెక్కరూ, ముక్కవాసన వేసే ఎర్రటోపి తోలుబెల్టు వీర యోధుడి వేషం.... కాని గురువా నువ్వెప్పుడో చచ్చి పోయినావ్— నీ శవం తిరుగు తోంది మొఖంమీద ఎముకలుతేలి– బతకదలుచుకుంటె నటించడం నేర్చుకోవాలె....

మీసాల పోతులను చూస్తే నీకు అరికాలిమంట నెత్తికెక్కినా? 'జీసాబ్.... ఆప్‌కా హుకుం సాబ్....' అనాలె- అధికార్ల మెప్పుకోసం ఎంత క్రూరంగానైనా ప్రవర్తించాలె- అట్లా నువ్వు చెయ్యలేవు. అథవా దొంగ కేసైనా బనాయించలేవు. కనీసం వేపచెట్టు కింది' మూడు కమ్మలాట పకీరుగాని మూతిపండ్లు రాలగొట్టి నీక్కావలసిన డబ్బు వసూలుచేసుకోలేవు. ఇంతెందుకు నువ్వు నడుస్తుంటే 'కట్‌మల్' అని నీవెంట పరిగెత్తే కోతిపోరగాండ్ల అధమాయించలేవు- థూ నీబతుకెందుకు.... వచేయ్ గురువన్నా, బతుకదలుచుకుంటే బద్మాషిగానన్న బతకాలె, లేకుంటె ఎదురించి నీమీద జులుం చేసెటోని బొండిగిసన్న పిసుకాలె- ఈ బతుకు చావుకంటె హీనమైంది-" లోపలున్న గురువయ్య సణుగుడు.

గురువయ్య మనుసులో ఆలోచనలు రేగిరేగి కండ్లు బైర్లుకమ్మినయ్- వరండాలో అటూయిటూ నడిచినడిచి కాళ్లు లాగుతున్నయ్.

మళ్లీ బూట్ల టకటక- కొన్ని బూట్లు మెట్లు దిగినయ్. జీపు గొణిగింది. గురువయ్య ఏదో గొణిగిండు. అరుక్కుంద కాండ్రించి ఊంచిండు. జీపు పొగను కక్కి వెళ్లిపోయింది.

"దొంగ లంజకొడుకులు పొద్దటనుంచి గోసబుచ్చుకుంటుండ్రి" నెక్కరు మడతలు నలగకుండ మడుచుకొని స్టూలుమీద కూర్చుందా మనుకున్నడు....

లోపలినుంచి పిలుపు.... సిగరెట్టు పెట్టెకి పచ్చనోటు.... పాత సైకిలు కిరకిర.... కరంటు స్తంభంమీద గుడ్లగూబ మూలుగుడు- అర్ధగంట తర్వాత గురువయ్య అర్జంటుగ, హడావిడిగ లోపలికడుగుపెట్టి సిగరేటుపెట్టె నిచ్చి పర్మిషన్ దొరుకుతుందని ఆశపడ్డడు.

"లోపలికెవ్వరిని రానియ్యొద్దు...." మీసాల సందుల్లోనుంచి పొగను గురువయ్య మూతిమీదికి ఊది బూట్లు లోపలికి నడిచినయ్.

మళ్లీ కర్రి మాంసం మీద ఆడుతోంది

ఈసారి ఆ పిలగాని గొంతు సింహం గర్జించినట్లుగా వినపడుతోంది.

"అరే కావలికుక్కా కొట్టురా! కొట్టు- ఎక్కడ్రా ఇంకా చితకకుండ మిగిలింది. చెంపలు పగిలినయ్- కాళ్లు పగిలినయ్- ఎన్ను విరిపోయింది- గోళ్లు చితికిపోయినయ్- ప్రజల సొమ్ముదిని కండలుబెంచింది నన్ను కొట్టడానికారా? ఒరే నువ్వు చెయ్యని నేరం లేదు- నీకు గవర్నమెంటు టోపిచ్చి, తుపాకిచ్చి, బట్టలిచ్చి కుక్కలా

పోషిస్తున్నది. నాలాంటి వాళ్లను గొడ్తవు- నీకు ప్రమోషనొస్తది- నీ మామ నీ బలం చూచుకొని ఇంకిన్ని కిరాతకాలు చేస్తడు. నా చేతులు కాళ్లు బంధించి, ఈ నాలుగు గోడల్లో కొట్టడం వీరత్వమూరా? నన్ను ఒదిలిపెట్టిచూడు ఈ పగిలి నెత్తురుకార్తున్న చేతులతోనే...." పిచ్చిగా, క్రోధంతోటి అరుస్తున్న దాగొంతు.

మీసాలకు నిజంగా పిచ్చెత్తిపోయింది. తలవంచని ఆ పిలగాణ్ని ఇంకాఇంకా రోషంతోటి, కోపంతోటి కొడుతున్నడు. మీసాల ఒంటినిండా చెమట- అలిసి పోయిండు.

మీసాలు అదిరేటట్టు అరిచిండు-

"గురువా....!"

గురుపయ్య లోపలికురికిండు.

"క్వీక్. ఈ లంజకొడుకు నోట్లె గుడ్డలుపెట్టు- అయినా తిట్టిండో? వాని బొండిగ పిసుకు" కుర్చీమీద కూలబడుతూ.

గురువయ్య వణికే చేతులతో అతన్ని సమీపించిండు. నిర్జీవంగా పడిఉన్న పిలగాన్ని స్తంభానికి కట్టిండు- నోట్లె గుడ్డలు కుక్కిండు.

మీసాలు మళ్లీ లేసిండు. బూటుకాళ్లతో తన్నిండు. కర్రతో పొడిసిండు. రక్తపు ముద్దను చేసేసిండు. మళ్లీ అలిసిపోయి కర్రను దూరంగా విసిరేసి బండ బూతులు తిట్టిండు.

"ఆని నోట్లె గుడ్డ సూడపీకు...."

ఆ పని గురుపయ్య చేసిండు.

తల వాల్చేసిన పిలవాడు దాహమన్నట్లుగ నాలుక బయటికి చాపి ఆడించిండు. మీసాలకు అనుమానమేసి తనే స్వయంగా నీళ్లు తాగించిండు.

పిలగాని బుక్కల నీళ్లు ఫోర్సుగా బయటికి చిమ్మినయ్. మీసాల ముఖమంతా తడిసింది.

"నన్నొక్కన్ని సంపుతవ్రా- కానీ- మీదెల్లకాలం నిలువదు. ఎంతకాలం- ఏమో?.... సంపేసిండు- బతుకుతే.... ఆగొద్దు.... సివరిదాకా.... మనము ముందుకే పోతం.... విప్లవం...." ఇంకా అంతాపొంతూ లేకుండా వదురుతూనేఉన్నడు. కండ్లు బాగా తెరుచుకున్నయ్. గుడ్లు మీదికిపోతున్నయ్. గురువయ్య, మీసాలూ కట్లిప్పి, గచ్చుమీద పడుకోబెట్టిండ్రు. తలవేపు ఓ ఫ్యాన్ కాళ్లవేపు ఓ ఫ్యాన్ పెట్టిండ్రు.

అయినా ఆ పిలగాడు జోరీగలాగ సప్పుడుచేస్తూ, మధ్యమధ్య నోరు తెరుస్తూ ఏదో వదురుతూనే ఉన్నాడు– బలహీనంగా చేయెత్తి కటకటాల వెనుకున్న పిలగానికేదో సౌంజ్ఞ చేసిండు. ఆ తరువాత పిడికిళ్లు మూసిండు.... కాసేపటికి క్రిందికి మీదికి ఎగిరిపడుతున్న ఛాతి ఆగిపోయింది.

మీసాలు కాలుగాలిన పిల్లిలా స్టేషనంతా తిరిగిండు– జీపెక్కి ఉర్కెకురికిండు.

గురువయ్య లేచి నిలబడి టోపీ తీసిండు. అతని కండ్లలోనుంచి నీళ్లు ఎడతెరిపి లేకుండా కారుతున్నయ్.

"ఏ తల్లిదండ్రి కన్నరో నా తండ్రీ? నువ్వు సింహాల బోనులో దిక్కులేని సావు సచ్చినవ్–" గురువయ్య గొంతులో గుడగుడ శబ్దం.

బయట జీపాగిన చప్పుడు– బూట్ల టకటక– గుసగుసలు....

"ఎదురు కాల్పుల్లో ఎన్‌కౌంటర్‌లో.... దర్‌నా మత్.... సమ్‌ఝో...." ఎవడో గుసగుసలాడిండు.

గురువయ్య మీసాలు అదిరినయ్. ముఖం అడివివేపుకు తిప్పుకున్నడు.

ఆ రాత్రి ఆ పిలగాడికోసం ఏడ్చిన గురువయ్య కానిస్టేబుల్ పెద్దకొడుకు మరణ వార్త అనివార్య కారణాలవల్ల మూడు గంటలాలస్యంగా చేరింది– గురువయ్య కొడుకు శవాన్ని చూసేటాల్లకు తూరుపు రేకలు బారుతున్నయ్.


## చైనా పత్రికలకు చందా కట్టండి

| పత్రికలు : | ఇంగ్లీషులో | సం. చందా | 3 సం. చందా |
|---|---|---|---|
| 1. చైనా రికన్‌స్ట్రక్ట్స్ (మాసపత్రిక) | ,, | రు. 7–50 | రు. 15–00 |
| 2. చైనా పిక్టోరియల్ ,, | ,, | 10–00 | 20–00 |
| 3. చైనీస్ లిటరేచర్ ,, | ,, | 10–00 | 20–00 |
| 4. చైనీస్ ఫారిన్ ట్రేడ్ (త్రైమాసిక) | ,, | 12–80 | 25–60 |
| 5. చైనీస్ మెడికల్ జర్నల్ (ద్వైమాసిక) | ,, | 67–20 | 130–40 |
| 6. ట్రేడ్ షీట్ (మాసపత్రిక) | ,, | 50–00 | |

చందాలు పంపవలసిన అడ్రసు :

**పీస్ బుక్ సెంటర్,** రామారావుపేట, కాకినాడ – 533 004

## ‘తిరుగబడితే....’ రచయిత సమాధానం

జనవరి ‘సృజన’లో ‘‘ఎదురుతిరిగితే....’’ కథమీద చర్చ జరిగిందని తెలుస్తూ పాఠకుల అమూల్యమైన అభిప్రాయాలను స్వీకరిస్తూ, కొన్ని విమర్శలకు నా జవాబు.

ప్రజా సమస్యలు చిత్రించుతూ (కథలు) రాయాలనుకొన్నప్పుడు, ప్రజల భాషలో రాయడం అవసరం. ప్రజల భాష మధ్యతరగతి పాఠకులను ఆకట్టుకోలేక పోతే నాపొరపాటుగాదు. కథ ప్రజలది- ప్రజలకోసం రాసింది కనుక ఖచ్చితంగా వాళ్ళ కర్థమై తీరాలి- కనుక వ్యవహారికంలో రాసి తీరాలి- రాశాను. మధ్యరకం పాఠకులకు కొంత అసంతృప్తి కలుగవచ్చు. కథ మధ్యరకం వాళ్లది కాదు. వాళ్లకోసం బండ్ల కొద్ది సాహిత్యం, ఆసక్తిజనకంగా, సందేశాత్మకంగా, సరళమైన భాషలో సృష్టించ బడుతోంది. చాలమంది రచయిత(త్రు)లు బద్ధకంకణులై ఆ పని చేస్తున్నారు. పూర్తిగా మాండలికం వాడాలనేది తాపత్రయం కాదు ధ్యేయం. వట్టికోట ఆళ్వారుస్వామి తొలుత ఆ తరువాత దాశరథి రంగాచార్య తెలంగాణా మాండలికంలో రచనలు చేశారు. వాళ్ల ప్రజల భాషను అంత కచ్చితంగా వ్రాయలేదనిపించింది. (వాళ్లు భాషమీదికంటె కథనంమీద శ్రద్ధ తీసుకున్నారు.) 1969 తర్వాత తెలుగుదేశంలో వచ్చిన విప్లవాత్మక మైన మార్పుల ఊపుతో ఇంకొంతమంది రచనలు చేశారు- ‘బద్లా’ రచయితలు ఇంకొంచెం ముందుకు నడిచి భాష విషయంలో ప్రజలకు సన్నిహితులు కాగలిగినారు కాని ఒక్క పాత్రల మాటల విషయంలోనే తెలంగాణా మాండలికం రాసారు. నేన మొత్తం కథంతా తెలంగాణా మాండలికంలోనే రాసాను. అనుకున్న దానికంటె దాదాపు అన్ని తెలంగాణా జిల్లాల నుండి ప్రజలు నా కథనాదరించారు.

వస్తువు విషయంలో చాలా తర్జనభర్జనలు జరిగాయి- ఇంకా జరుగుతున్నాయి కూడా- కథా వస్తువు గురించి ఇంకా తర్జనభర్జనలు జరుగాలి కూడా. ప్రజా సమస్య కనుక తీర్పు అంత తొందరగా చెప్పడం జరుగదేమో?

తెలంగాణా అన్ని పల్లెటూళ్లలో (నాకు తెలిసినంతవరకు) పంచాయితీలు జర్గడం కల్లు కుండతో మొదలుకావు. (పెద్దమనుషులు సాధారణంగా అగ్ర కులాలవారు గనుక నీచ కులాలవారితో కలిసి తాగరు, తినరు. పెద్దమనుషుల్లో మళ్లీ కులాల పట్టింపు వుంటుంది. అందులో షావుకార్లు వగైరా ఉంటారు. దడావతు పెద్దలందరికి చెందదు దానిక్కూడా కొందరే తగుదురు.) దడావతు కొన్ని ప్రాంతాల్లో ముందే నిక్కచ్చిగా వసూలు చేస్తారు. దడావతు చెల్లించడానికి స్తోమతలేనిపక్షంలో నమ్మకంగల మనిషి ‘జమానతు’గా ఒప్పించుకుంటారు. మాదుగులల్లోకూడా దడావతు వసూలువిషయంలో

ఆ పద్ధతే అమలుచేస్తారు. కల్లు తాగిన తరువాత లొల్లి తప్ప పంచాయతుండదు. కనుక ముందు నామమాత్రపు పంచాయితీ జరిపి ఆ తరువాతే తాగుతారు. సాధారణంగా ఎవడూ కులాన్ని ధిక్కరించడు. ధిక్కరించి బతుకలేడు. అమాటకొస్తే 'నెలుకల'కు పోయిన కొంరయ్య సమాజం వెలుపల ఒంటరిగా బతుకలేడు. (ఈ విషయం విమర్శకులెవరు పట్టించుకోలేదు) కొంరయ్య బతకాలంటే ఎన్నో నిత్యావసరవస్తువులు కావాలి. వ్యవసాయ పనిముట్లు కావాలి. అవ్వన్నిటిని ఊరునుంచి ఏరూపకంగానైనా పొందాలి. ఉదా: మోట నడువాలంటె మోట గీరె కావాలనుకొందాం. గీరె వడ్లోడు చేయాలి. వడ్లోడు ఊరి దొరలకు వ్యతిరేకంగా 'గిరుక' చేసి యివ్వడానికి సాహసించడు. ఊరినుంచి పొందే ప్రతి వస్తువులోపల దోపిడి ఉంటుంది. కొంరయ్యను ఊరు వెలివేసినప్పుడు, అవ్వన్నిటి దగ్గర ఎన్నో రకాల ఘర్షణలు ఎదుర్కోవాలి. అడుగడుగున కొంరయ్యను సర్వనాశనం చేయడానికి ఎన్నో శక్తులు అదునుకోసం పొంచి చూస్తుంటాయి. అవ్వన్నిటిని రాయాలంటే (నవలౌతుంది.) సమాజంనుంచి విడిపోయి బాగుపడడం మార్క్సిస్టు అవగాహనకాదు. సమాజంలోపలే ఉండి, సమాజంనుంచే స్ఫూర్తిపొంది తనను దోపిడిచేసే శక్తులమీద, తనవలె దోపిడికి గురౌతున్న శక్తులతో సమేకమై తిరుగబడాలె. (అట్లా రాయకపోవడం ఈ కథలోని పొరపాటు)

నాలుగు లక్షల రూపాయలు హైకోర్టు కేసుకు ఊడిసయంటే.... దొర కేవలం ఒక్క లాయరుకే ఫీజు ఇవ్వలేదని, హైకోర్టు చేరేదాక ఎన్నో చేతులుంటాయని, అవ్వన్నిటికి తడుపాల్సిన అవసరముందని విజ్ఞులు గ్రహించాలి. (ఆ మాట రాసి ఉండాల్సింది. కాని అప్రధాన విషయంగా ఒదిలేయడం జరిగింది. కనుకనే విమర్శకు అస్కారమేర్పడింది.) లక్షలు మింగెటోల్లున్నరు మరి ఈ దేశంలో. దొరకు లక్షలు కాదు కావాల్సింది. ఆ సమయంలో ఖాందాని ప్రజలముందు. ఓటమికాదు. విజయం. దొర తన దర్పం కాపాడుకోవటం కోసం ఎన్నైనా ఖర్చు చేయగలడు. తీర్పును తన కనుకూలంగా మలుచుకోగలడు. లాయర్లకు అధికార్లకు దొరమీద దొర డబ్బు మీద ప్రేమ కదా !

దొరల పాలేర్ల చైతన్యం గురించి కథలో 'మొండి' పాత్ర ద్వారా పరిచయం చేశాను. మోట దగ్గరికి నీల్లుతాగడానికొచ్చి కొంరయ్యకు సానుభూతి చూయించుతాడు. గ్రామంలో ఒకరి గురించి ఒకరు తప్పకుండ ఆలోచిస్తారు. (ఈ విషయంమీద కొంత రాయాల్సిఉండె) పాలేరోల్లకు దొర ధోపిడిగురించి బాగాతెలుసు. కొంరయ్య 'పెరడు అక్రమంగా కోయడానికి' వచ్చినప్పుడు చెప్పిన విషయాలు వాళ్లకు ముందే తెలుసు.

తెలిసికూడ విధిలేని పరిస్థితుల్లో చేయడానికొచ్చినారు. తెలుసు కనుకనే కొంరయ్య న్యాయంకోసం చేసే పోరాటాన్ని సమర్థించి ఊరుకున్నారు. ఒక్కరో ఇద్దరో ఉంటే దొరముందు తమ విశ్వాసాన్ని ప్రదర్శించుకోను ప్రయత్నిస్తారు. అక్కడ చాలా మందున్నారు— ఇలాంటి విషయాలు ప్రాక్టికల్‌గా చూస్తే బాగా అర్థమైతాయి. అదిగాక పాలేర్లోల్లు ఆ సమయంలో కొంరయ్య తెగింపునుచూసి ఊగిసలాటలో పడిపోయిండ్రు. అసలు దొరే కొంరయ్య ఆకారాన్ని, నిబ్బరాన్ని చూసి తత్తరపడ్డాడు.... వాళ్లదో లెక్కకాదు.

కొంరయ్య భూమి కొంరయ్యకు దక్కింది.... అతని పేరు మీద పట్టా ఉన్నా లేకున్నా ఒక్కటే. పట్టాలున్న రైతుల భూములు 1978లో కూడ దొరలు బలవంతంగా ఆక్రమించుకుంటున్నారు. వాళ్లకు పట్టా కాయితం అడ్డంకాదు.... ఎసన్‌సీ ఆక్టు ప్రకారంగా ఎదురుమదురుగా కొందరికి భూములు సంక్రమించినా కూడా దొరలు ఆ భూములను తమ ఆధీనంలో ఉంచుకోవడం.... లేక ఎకరాన కొంత పైకానికి అమ్ముకోవడం గ్రామ గ్రామంలో ఉంది. గ్రామీణ బీద రైతాంగానికి పట్టాకాయితాలు కాదు కావాల్సింది భూమి— భూమిని ఏ ఆక్టు దఖలుపరచలేదు. పోరాటం మినహా సంస్కరణలు వాళ్ల భూదాహాన్ని చల్లార్చలేవు— దొరల ప్రభుత్వం సంస్కరణలు తప్ప ఇంకేమి నిక్కచ్చిగా చేయదు.

అంత అవమానం పొందిన దొర ఎంతకాలమో సహించడు— దొర దొరబలగం యావత్తు కొంరనిమీద దాడి చేస్తుంది. కొంరయ్య కూడా చేతులు ముడుచుకొని కూర్చోడు— కూర్చుంటే బతుకలేడు. వర్గ సంఘర్షణలు వర్గవైరుధ్యంవల్ల జర్గుతాయి. అలాంటి పరిస్థితిలో (సరిగ్గా) కొంరయ్యకు అండకావాలి. తనకోసం పోరాడే రాజకీయ పార్టీ కావాలి. ఆ గ్రామాల్లో రాజకీయ వాతావరణం ఏర్పడాలి— ఏర్పడుతుంది కూడా— (ఏర్పడి ఉంటుంది కూడా.) ఆ ఊళ్లో భూమి దున్నేటోడు కొంరయ్య ఒక్కడేకాదు— దోపిడి చేయబడేవాడు కొంరయ్య ఒక్కడేకాదు— గ్రామం గ్రామం యావత్తూ దొర ఫ్యూడల్ అధికారంకింద, దోపిడికింద నలిగిపోతోంది. భూమికోసం భుక్తికోసం పోరాటం చేసినవాడు కొంరయ్య ఒక్కడే కాదు— మొత్తం పేదరైతాంగం, వ్యవసాయ కూలీలు కొంరయ్య పరిస్థితిలోనే ఉన్నారు. కాని కొంరయ్య పాత్ర ఒక ఉదాహరణ మాత్రమే— కొంరయ్య గ్రామీణ ప్రజానీకంలో ఒక మనిషి మాత్రమే. పీడన నుంచి ప్రతిఘటన ఉద్భవిస్తుంది. పీడనకు గురైన వారంతా ఒకటౌతారు. ఆ విషయం కథలో ప్రస్తావించలేదు. అప్పటి నా దృక్పథంలో ఆ విషయం

నిర్ణయించుకోవాల్సింది ప్రజలే. వాటి ఫలితాలు కూడా ఊహించి రాయడం భావ్యం కాదనే రాయలేదు.

అందుకే రానున్న పరిణామాన్ని సింబాలిక్‌గా చెప్పడం జరిగింది. పరుగెత్తుతున్న దొర అతని బంట్లు, ఉగ్రనరసింహావతారంలా నిలబడ్డ కొంరయ్య గుడిసెవెట్టోలో పాలేర్లకు కనిపించారు— పాలేర్ల మనసుల్లో రానున్న పోరాటం రూపు దిద్దుకుంటున్నదన్న మాట.

ఆ ప్రాంతంలో రాజకీయ చైతన్యం ఉచ్ఛస్థాయిలో లేకుండె. కథాకాలానికి "సోరోడు మంథెన్లో సభ చెప్పి దేవుడు లేడంటే నిచ్చమే ననుకునే" స్థాయిలో రాజకీయ చైతన్యం ఉన్నది. ఆతరువాత రాజకీయ చైతన్యం దాని మార్గంలో అది పురోగమిస్తుంది— అది ప్రజల అంతర్వాణి— కనుకనే కొంరయ్య తిరుగుబాటు చేసిండు. ఆ అంతర్వాణిని నినాద రూపకంగా చెప్పకపోవడం లోపంగా భావించి పూర్తిగా రాజకీయ చైతన్యం కొంరయ్యకు లేదనడం సబబుకాదు— రచయితగా నేను కొన్నిపరిధుల్లో అంతవరకే చిత్రించడం రచయిత లోపంగాని కొంరయ్య లోపంకాదు. కనుక ఆ కథ ఇంకా ఆలోచించాల్సిన అసంపూర్తికథ. పోరాటం విజయవంతమయ్యేదాక అన్ని కథలు అసంపూర్ణాలే ఒక లెక్కన—

ఆ దశలో వాళ్లకు రాజకీయాలు తెలిసి ఉంటే ఆ కథ ఈ కథకు తరువాయి. ఆ కథానాయకులు మొత్తం ప్రజానీకం.

రాజకీయాలు ఆకాశం నుండి ఊడిపడవు. అది జీవితం యొక్క అంతర్గత సంఘర్షణ నుంచే పుడుతాయి. అంతర్గత సంఘర్షణకు ప్రాధాన్యత నివ్వకుండా మొత్తంగా పోరాటాన్ని చూడగోరడం వేళ్లను, కాండాన్ని చూడకుండా చెట్టుఉపరి భాగం ఆకులు కాయలు చూసినట్లె— రాజకీయాలు జీవిత సంఘర్షణను శాస్త్రీయంగా విసస్తాయి; నిజమే— మంచిది బానోకాదో మనం ఒడ్డుమీద నిలబడి ప్రవచించడం సుళువే— కాని అలాంటి స్థితిలో ఏంచేయాలన్నది ప్రధాన విషయం.

కొంరయ్యకు రాజకీయాలు తెలియవు కనుక దొరకు లొంగిపోవాలా? అన్నేండ్లు అంత శ్రమకోర్చి రేవుకు తెచ్చుకున్న భూమిని వొదులుకోవాలా? దొరకాళ్లమీదపడి రాజీపడే అవకాశముందా? అట్లా ఎన్నటికీ జరుగదు. జీవితం అనుభవం అందుకు ఒప్పుకోవు.

కాలం కొంరయ్యకు రాజకీయాలు నేర్పుతుంది. కొంరయ్య 'అవసరం' రాజకీయాలవేపు తరుముతుంది. పోరాటం వివిధ రూపాలు, వివిధ దశలతో పురోగమిస్తుంది. కొంరయ్య తిరుగుబాటు పోరాటంలో ఒక దశ మాత్రమే.

'చిన్న చిన్న తగువులకు ప్రాధాన్యత' నియ్యడం వాళ్లలో ఐక్యతలేదని నిరూపించడానికి కాదు. అసలు తగువులు చిన్నవైనా పెద్దవైనా ఎట్లా మొదలైతాయి? వాటిని ఎవరు సృష్టిస్తారో తెలియచేసేందుకే— కొంరయ్య జీవితంలో జరిగిన తగువులన్నీ 'నీరటిబిచ్చం దొర ఎగబెట్టిన' దానినుంచే పుట్టినయ్. దోపిడిదారు తను చాటుకుండి దెబ్బతీసే విధానం తెలియచేయడానికే 'తగువులు' రాయడం జర్గింది. పేద ప్రజల అస్తవ్యస్త జీవితవిధానంలో తగువులు అతిసాధారణం. ప్రజల గురించి తెల్సుకోవాలంటే వాళ్ల తగువుల గురించి, దాని మూలస్వరూపం గురించి తెలుసుకోవాలె.

దొర నీరటిబిచ్చం ఎగబెడితే కొంరయ్యకు లింగయ్యకు తగువొచ్చింది— పెద్దమనుషుల అక్రమ తీర్పు ఫలితంగానే మల్లమ్మకు పోశమ్మకు తగువొచ్చింది. 'కోడిపిల్లే' తగువుకు ప్రధాన కారణంగా ఎంచుతే నేనేం చెప్పాలి? పైగా అదే అభిప్రాయంతో "పేదప్రజలపై జరిగే దోపిడికి పేదప్రజలే కారణం" అని అర్థం చేసుకుంటే అది నా పొరపాటుకాదు. "కథను ఏ ప్రధాన విషయంమీద కేంద్రీకరించాలో కేంద్రీకరించకుండా పేదప్రజలు వ్యవహరిస్తున్న పద్ధతులపై కథ నడపడం" అవుతుంది. ఈ కథలో ప్రధాన విషయం భూమి— ఆ విషయాన్ని ఈ కథ చదివినా లేక చదువగా విన్న ప్రజానీకం గుర్తించింది.

"భూస్వామ్యవర్గాల దోపిడిని దాని స్వరూప స్వభావాలను సరిగ్గా చిత్రించలే" దన్న విమర్శను సహృదయంతో స్వీకరిస్తున్నాను.

నా తొలి కథను ఆదరించిన ప్రజలకు, పరిశీలనాత్మకంగా చదివి ఇంకా ఎన్నో సలహాలందిస్తూ తమ అభిప్రాయాలను తెలిపిన పాఠకులకు, ప్రచురించిన సృజనకు నా ధన్యవాదాలు.

— **అల్లం రాజయ్య**

వెలువడింది

పరిటాల శ్రీరాములు రచనల సంకలనం

**పోరాటాల శ్రీరాములు**

విరసం ప్రచురణ వెల: **75** పై.

ప్రతులకు: సృజన మాసపత్రిక
హనుమకొండ, వరంగల్ 506 001

## 'బావి' కథపై చర్చ :

సృజన జనవరి సంచికలో 'బావి' కథ చదివాను. తర్వాత నాకు కలిగిన అభిప్రాయాలు రాస్తున్నాను.

సమాజంలోని అసమానతలకి 'దోపిడీ' లాంటి విషయాలే కారణం అని ప్రసాద్‌కి స్పష్టమైన అవగాహన ఏర్పడిందంటున్నాడు రచయిత. అందుకని తనలాంటి మరికొందర్ని పోగుచేసి ఒక గ్రూప్ ఏర్పాటు చేశాడట. కానీ అతను ఏ విషయం గురించైనా, వాళ్ళతో చర్చించడం గానీ, వాళ్ళ దృక్పథంలో మార్పు తేవడం గానీ మనకెక్కడా కనిపించదు. ప్రతి విషయానికీ సినిమా హీరోలా తానొక్కడే ముందుకు దూకుతుంటాడు.

కాఫీ హోటల్లో హరిజనులకి బయట కూర్చోబెట్టి వేరుగా టీ పొయ్యడంచూసి, ఆ హోటల్ యజమానిని బైటికి లాగి, కొట్టి, మళ్ళీ ఇలాచేస్తే చంపేస్తానని బెదిరిస్తాడు ప్రసాద్. అతను ఆ రకమైన సంఘటన చూడటం అదే మొదలా ? చిన్నతనం నుండీ ఆ వూళ్లోనే 'హరిజనుడిగా' పెరిగినా అంతకుముందెన్నడూ చూడలేదా ? చూసివుంటే ఎన్నడూ తెలియని విషయాన్ని హఠాత్తుగా చూసి ఎదిరించినట్టు ఎదిరించా డెందుకని ? ఒకవేళ ఆ హోటల్ యజమాని తిరగబడి "ఈ హోటల్ నాది. నా యిష్టం. నేనలాగే పోస్తా. ఇష్టముంటే తాగండి, లేకుంటే మానండి" అని వుంటే ఏంచెయ్య గల్గేవాడు ప్రసాద్ ? ప్రసాద్ సరైన చైతన్యం కలిగినవాడైతే ఆ హోటల్‌కి వెళ్ళటం అవమానం అని మిగిలిన హరిజనులకి నచ్చజెప్పి వుండేవాడు.

మాలలమీద 'అభిమానం'తో కథ రాసిన ఈ రచయితే ఆత్మహత్య చేసుకున్న హరిజన యువతిని "మామిడికాయలాంటి యువతి...." "జొన్నచేలో జొన్నమువ్వ లాంటి సీత...." అని వర్ణిస్తున్నాడు. దారుణమైన అవమానంజరిగి, నిస్సహాయ స్థితిలో ప్రతీకారం కోరుతున్న ఒక స్త్రీ నిజమైన సానుభూతిపరులకి 'మామిడీకాయ' లాగా 'జొన్న మువ్వ' లాగా కనబడుతుందా ? ఆమె కాముకుడైన దొర కళ్ళకి కనబడుతున్నట్టే కనబడుతోందా రచయితకి కూడా ? "....ఆమె పొలములో పనిచేస్తుండగా దొరవచ్చి దాని అందాన్ని...." అంటున్నాడు రచయిత. ఆమె గనుక ఒక దొరభార్యో లేక షావుకారు భార్యో అయి వుంటే 'ఆవిడ – ఆమె' అనివుండేవాడు గానీ 'అది – దాని' అనేవాడుకాదు. కేవలం ఒక 'మాలది' కనుక 'అది' అయింది. పైపై కబుర్లు చెప్పేవాళ్ళు ఎక్కడో ఒకచోట తమ నిజస్వరూపం బైటపెడతారు.

దగాపడ్డ యువతి సంగతి తెలిసి, ప్రసాద్ వొక్కడూ కోపంతో దొరని చంపడానికొస్తుంటే, దొర పారిపోయాడట. పెద్దలే గనుక అడ్డురాకుంటే దొర యింటిని

తగులబెట్టేసే వాడేనట. ఒక హరిజనుడు ఇళ్ళమీదికి వస్తూంటే, న్యాయం ఎవరిదైనా సరే, పారిపోతారా దొరలు? ఇళ్లు తగలేస్తానంటే వూరుకుంటారా? ఇక ఆ దొరకి వెనక బలగమే లేదా? కనీసం లోకజ్ఞానం అయినా వుందా ఈ రచయితకి?

ఎమ్మెల్యే సీతారాం తనకీ దొరకీ రాజీ చెయ్యటానికి ప్రయత్నిస్తోంటే, అతని కపటత్వం అర్థమైపోయిందట ప్రసాద్‌కి. కానీ అంతా అర్థమైన అతను చేసిన పనేమిటి? ఆ యెమ్మెల్యే ఇంట్లోనే, ఆ దొర పక్కనే కూచుని కాఫీ తాగి మరీవచ్చాడు. ఒక నిస్సహాయురాలికి అన్యాయం చేశాడని, దొరని చంపెయ్యడానికే నిశ్చయించుకున్న వాడు చెయ్యవలసిన పనేనా యిది? నిజానికి కాఫీ కప్పుని మంత్రి మొహానికి కొట్టి రావాల్సిన పరిస్థితి అది.

యెమ్మెల్యే సీతారాం మంత్రి పదవికి పోటీచేస్తూ, ఓట్లు వేయించమని అడగడానికి వస్తే, "ఆత్మని చంపుకు ప్రచారం చెయ్యలేను. కానీ మీరు గెలిస్తే మంచిదే. కాబట్టి మావాళ్ళెవరైనా ప్రచారంచేస్తే కాదనను" అంటున్నాడు ప్రసాద్. దీన్నిబట్టి ప్రసాద్‌కి ఇంకా ఆ యెమ్మెల్యేలో నమ్మకం వుందని తెలుస్తోనేవుంది. మరి రచయిత చెప్తున్నట్టుగా అతనికి యెమ్మెల్యే కపటత్వం ఎక్కడ అర్థమయింది? పైగా తను చెయ్యటాని కిష్టపడని, ఆత్మను చంపుకోలేని పని తనవాళ్ళు చెయ్యొచ్చట.

వూరికి దూరంగాకాదు, వూళ్లోనే కట్టాలి అంటాడు ప్రసాద్. "ఇళ్లు వూరికే వస్తోంటే ఈ అల్లరి యెందుకూ?" అంటున్నారు హరిజనులు. రచయిత చెప్తున్న ప్రకారం ప్రసాద్‌కి చైతన్యం వచ్చి దాదాపు నాల్గేళ్ళయింది అప్పటికి. కానీ మరింత కాలమూ అతను తన చుట్టూవున్న హరిజనులనేం ప్రభావితం చేశాడో, సరైన అవగాహన ఏంనేర్పాడో అర్థంకాదు. ప్రసాద్ మాట్లాడుతున్నది 'అల్లరి'గా వుంది వాళ్ళకి.

ఈ కథలో వున్న అతి పెద్ద బ్రహ్మాండమైన లోపమిదే. ప్రతీదానికీ 'వ్యక్తిగత పరాక్రమం'తో తానొక్కడే పైకి లేస్తూంటాడు. "అది నాకు నచ్చలేదు", "దీన్ని నేనొప్పుకోను" అంటాడేగానీ, ఇతర్లను కూడా తనతో కలుపుకుని "మేము - మాకు" అని ఎక్కడా అనడు.

ఈ ప్రసాద్‌ని ప్రభావితంచేసిన కథలోని రచయిత ప్రసాద్‌కి వుత్తరం రాస్తూ, "నువ్వోడిపోవడానికి కారణం హరిజనుల్లోని స్వార్థం...." అంటున్నాడు. కనీసావసరాలను కోరుకునే, అమాయకులైన హరిజనులకి 'స్వార్థం'ట. ఇదీ ఈ రచయితకున్న అవగాహన.

కథ క్లైమాక్స్‌లో, తన వూళ్ళో హరిజనున్ని కొట్టడం, హరిజనుడైన తనకి అప్రతిష్ఠ అని భావించి, మంత్రి సీతారాం రాజీ చెయ్యటానికి పంచాయితీ ఏర్పాటుచేసి

నప్పుడు, ప్రసాద్ ఏమీ మాట్లాడడు. ఎందుకయ్యా? అంటే– "ఈ పంచాయితీ తన కేమీ వొరగబెట్టదని ఆయనకి తెలుసు" అంటున్నాడు రచయిత. మరి అంత తెల్సినవాడైతే ఆ దొంగ పంచాయితీని బహిష్కరించక, దానికెందుకు హాజరైనట్టు? నామమాత్రంగా ఏదో వొక తతంగం జరుగుతుంటే మర్యాదకోసం దానికి హాజరవ్వాల్సిందేనా? తర్వాత వొక్కడూ వాకౌట్ చేసి కథని ముగించాడనుకోండి ప్రసాద్.

ఈ రచయిత కథే వొకటి 'ప్రజాసాహితి' ప్రారంభ సంచికలో పడింది. దాన్లో కూడా వ్యక్తిగత పరాక్రమంచూపే కథానాయకుడున్నాడు. అప్పుడు దానిలోని తప్పుల్ని తీవ్రంగా విమర్శించినా, ఈ రచయిత ఏమీ నేర్చుకున్నట్టులేదు.

– ఉక్క
హైద్రాబాద్

## 'సృజన' వద్ద ప్రస్తుతం దొరికే పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు– విప్లవం కుట్రకాదు | 0–30 |
| 2. | చెల్లీ చెంద్రమ్మ (ఒగ్గుకథ) – ఎ.ఎల్. చిత్రలేఖ | 0–40 |
| 3. | తెలంగాణా వీరయోధులు(బుర్రకథ)– సీతారామాంజనేయులు | 0–60 |
| 4. | కిరణాలు (మృతవీరుల సంస్మరణ గేయాలు) | 1–00 |
| 5. | చైనా విప్లవం – సాంస్కృతికోద్యమం | 1–25 |
| 6. | గోడా కార్యక్రమం – పరిశీలన | 1–50 |
| 7. | గమ్యం (కవితలు) – చెరబండరాజు | 2–00 |
| 8. | జొలికేక (పాటలు) – వంగపండు ప్రసాద్‌రావు | 2–50 |
| 9. | నా గొడవ – కాళోజీ | 3–00 |
| 10. | రక్తాక్షరాలు – జూలియస్ ఫ్యూజిక్ | 3–00 |
| 11. | తెలంగాణా పోరాట పాటలు | 4–00 |
| 12. | భారత దేశంలో నా జైలు జీవితం – మేరీటేలర్ | 6–50 |
| 13. | మావో రచనలు | 15–00 |
| 14. | డిటెన్యూ డైరీ – కె. వి. రమణారెడ్డి | 20–00 |
| 15. | విమర్శకులు – ఆత్మవిమర్శ ,, | 0–40 |
| 16. | అరసం కాయకల్ప చికిత్స ,, | 1–25 |
| 17. | భారత స్వాతంత్ర్య పోరాటాలు ,, | 2–50 |
| 18. | జైలు కోకిల ,, | 3–00 |

## కోరస్

నలంద్ర

నేను
భూమికీ - ఆకాశానికీ వున్న
సంబంధాన్ని చెప్తే వీళ్లు
నవ్వుతారు-

నేను
నవ్వుకీ - ఏడుపుకీ మూలం చెప్తే
వీళ్లు కోప్పడతారు-

నేను
ప్రవాహానికీ - నిశ్చలతకీ రూపంచూపితే
వీళ్లు ససేమిరా అంగీకరించరు-

నేను
ఆలోచనలకీ - ఆచరణకీ అర్థం చెప్తే
వీళ్లే అపార్థం చేసుకుంటారు-

నేను
'మేధావు'లకూ - మూర్ఖులకూ సామ్యంచూపితే
వీళ్లు నా మీద రాళ్లు విసురుతారు-

నాకు తెలుసు
నేను మీ ముఖాలు చూసుకోండంటూ
అద్దం చూపిస్తే
వీళ్లే దాన్ని ముక్కలు - ముక్కలుగా
పగలగొట్టేస్తారు-

నేను గొంతెత్తి
పాడినా - మాట్లాడినా
గొంతు నొక్కేయ ప్రయత్నిస్తారు-

ఆలోచనలు
నన్ను ముంచేస్తే
నేను పరిగిడితే
నన్ను వెర్రివాడని
చూపుడు వేళ్లతో చంపేస్తారు-

అయితే మాత్రం!
నాకు తెలుసు
యిప్పుడు నేను
ఏ శవం ముఖంమీద ఉమ్మేస్తున్నానో
అదే కుళ్లి కంపుకొట్టేస్తుంటే
రేపు వీళ్లే
నా పాటకి కోరస్ అందుకుంటారు-
నాకు భయంలేదు
నేడు నేను
ఈ పాట
శ్రుతికలిపి పాడుతాను.

## వెధవ టోపీలు

అలిశెట్టి ప్రభాకర్

ఎర్ర టోపీ లేంచేస్తాయి ?
తీరా ఘోరం జరిగాక
ఆరా తీయటానికని
వెర్రి కుక్కల్లా పరిగెత్తుకొచ్చి
అరుస్తాయి-
అనవసరంగా అనామకుల్నెవ్వర్నో
కరుస్తాయి.

మరి తెల్లటోపీ లేంచేస్తాయి ?
జరిగేవి జరగనివి
అన్నీ ఎరిగినా
ఎప్పుడూ అప్పుడే
కొంపమునిగిపోయినట్లు
ప్రజలముందు బాహాటంగా
బరితెగించి ఏడుస్తాయి.

# ప్రపంచ చరిత్ర చదవడం గురించి మరోమారు

చరిత్ర అధ్యయనం, చరిత్ర పరిశోధన వీటిమీద మనకు మార్గదర్శక సూత్రం ఏమిటంటే గతానికన్నా వర్తమానాన్నే ఎక్కువ పట్టించుకోవాలి. చైనా చరిత్ర, ముఖ్యంగా 1840 నల్లమందు యుద్ధం నాటి నుంచి బాగా అధ్యయనం చేయమని మావో చెప్పారు.

అలాగే ప్రపంచ-చరిత్ర చదివేప్పుడు కూడా మనం ఈ నాటి చరిత్రనే ఎక్కువగా చదవాలి. నేటి వర్గపోరాటాలు, ప్రధాన వైరుధ్యాలు ప్రపంచంలో ఎలా పెరిగాయో మనకు తెలుస్తుంది. ఇవాళ అంతర్జాతీయ సమస్య లనేకం వున్నాయి. వాటన్నింటిని ఒక క్రమపద్ధతిలో పరిశీలించాలి. అనాటి వర్గపోరాటాల నుంచి అనుభవాలు, గుణపాఠాలు నేర్చుకుంటే ఈనాటి వర్గపోరాటాలను అర్థం చేసుకోవడానికి మనకు బాగా ఉపయోగపడతాయి.

## మూడు దశలు :

ఇంగ్లీషు బూర్జువా విప్లవం (1640) నాటి నుంచి మొదలెడితే ఆధునిక ప్రపంచ చరిత్ర 300 ఏళ్లు గడిచింది. దీనిని మూడు దశలుగా విభజించవచ్చు. **1)** 1640 నుంచి 1871 పారిస్ కమ్యూన్ వరకు. అ దశలో పెట్టుబడిదారీ విధానం ఉదారంగా వుంది. పెట్టుబడిదారీ విధానం దీర్ఘకాలిక పోరాటాల ద్వారా ఐరోపా అమెరికాల్లో అనేక దేశాల్లో భూస్వామ్య విధానాన్ని తోసిరాజంది. **2)** 1871 నుంచి 1917 రష్యా విప్లవం వరకు. ఈ దశలోనే ఉదారంగావున్న పెట్టుబడిదారీ విధానం గుత్తపెట్టుబడి విధానంగా మారింది. ఈ దశలోనే సోషలిస్టు, జాతీయ ప్రజాస్వామ్య విప్లవోద్యమాలు పెట్టుబడిదారీ, వలస, సామ్రాజ్యవాదాలమీద ఎదురుదెబ్బ తీశాయి. లెనిన్ నాయకత్వాన 1917 లో జరిగిన రష్యా అక్టోబరు విప్లవం ప్రపంచ చరిత్రలోనే కొత్త యుగం స్థాపించింది. అనాటి నుంచి ప్రపంచ చరిత్ర మూడవ దశలో అడుగెట్టింది. **3)** అదే నేటి చరిత్ర. మావో అన్నారు: "ఈ చారిత్రకదశలో పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదాలు కూలిపోతుంటే, ప్రపంచ సామ్యవాదం, జనతా ప్రజాతంత్రం ముందుకు చొచ్చుకుపోతున్నాయి.

ఒకవైపున పెట్టుబడిదారీ విధానం పుట్టుక పెరుగుదల పతనం, ఇంకోవైపున సామ్యవాదం పుట్టుక పెరుగుదల పురోగమనం మనం చూస్తున్నాం. పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా పీడితుల, తాడితుల పోరాటాలు, వలస సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా వలస దేశాల ప్రజల పోరాటాలు, అగ్రరాజ్యాల జోక్యానికీ దోపిడీకి వ్యతిరేకంగా

బడుగు దేశాల తిరుగుబాట్లు మనం నేటి ప్రపంచంలో కళ్లారా చూస్తున్నాం. ఒక్క మాటలో చెప్పాలంటే నిన్నటి ప్రపంచంలోని వైరుధ్యాలే నేటి ప్రపంచంలో కొత్త చారిత్రక పరిస్థితుల్లో కొనసాగుతున్నాయి.

## మౌలిక వైరుధ్యాలు :

నేటి ప్రపంచంలోని మౌలిక వైరుధ్యాలు, పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదాల స్వరూపం, సోషలిస్టు విప్లవం, వలస దేశాల్లో తిరుగుబాట్లు— వీటన్నింటిని చక్కగా విడమర్చి, పరిశీలించి మార్క్సిస్టు మహోపాధ్యాయులు చెప్పారు. వీటిని గురించిన అంచనాలు, నిర్ణయాలు మనకి ముఖ్యంగా మూడు రచనల్లో కనిపిస్తాయి. **1)** కమ్యూనిస్టు ప్రణాళిక (మార్క్స్-ఎంగెల్సు) **2)** సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధానపు అంత్యదశ **3)** నూతన ప్రజాస్వామ్యం (మావో). ఈనాటి ప్రపంచ చరిత్రను పరిశీలించేందుకు మనకీ మూడు రచనలూ మార్గదర్శకాలు. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం ఆసరాతోనే మనం బూర్జువా చరిత్రకారుల వక్రభాష్యాలను వమ్ముచేసి, వర్గపోరాటాల నుంచి అనుభవాలు గుణపాఠాలు నేర్చుకోగలం.

పెట్టుబడిదారీ సమాజంలో ప్రధానవైరుధ్యం శ్రామికవర్గానికీ బూర్జువావర్గానికీ మధ్యవుండేదే. బూర్జువాలకు సామ్రాజ్యవాదులకు అమ్ముడుపోయిన బుద్ధిజీవులందరూ కూడా పెట్టుబడిదారీ విధానాన్ని పొగుడుతారు. కాని కల్లలు నిజాలను కప్పిపెట్టలేవు. నిజానికి "గత వంద ఏళ్లగా బూర్జువావర్గం, ఎన్నడూ కనీ వినీ ఎరుగనంతగా ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేసింది" (కమ్యూనిస్టు ప్రణాళిక). కాని "చెమటబిందువుల్లోంచి నెత్తుటిబొట్టుల్లోంచి పుట్టేదే పెట్టుబడి" (పెట్టుబడి). ఇంటాబయటా కూడా అదేపనిగా దోపిడీ కొనసాగించడంవల్లనే పెట్టుబడిదారీ విధానం పుట్టిపెరిగింది. ఇంగ్లీషు బూర్జువా వర్గం 300 ఏళ్ళపాటు— 15వ శతాబ్దం నుంచి 19వ శతాబ్దం వరకు— ఉద్యమం కొనసాగించారు. కర్షకులను పొలాల్లోంచి బలవంతంగా వెళ్లగొట్టారు, వాళ్ల ఇళ్లు తగలెట్టారు, పంటపొలాలను పచ్చికబీళ్లుగా మార్చేశారు. చిట్టచివరకు శాసనాలుచేసి కర్షకులను మిల్లు కూలీలుగా మార్చేశారు. అమెరికావాళ్లు రెడ్ఇండియన్లపై హత్యాకాండ జరిపారు. ఇప్పుడు అమెరికాలో మిగిలిపోయింది 6 లక్షల రెడ్ఇండియన్‌లుమాత్రమే. అందుకే మార్క్సు "అమెరికాలో వెండీబంగారాలు కనుక్కోవడం, గనులు కబళించడం, ప్రాచ్యదేశాలను జయించి దోచుకోవడం, ఆఫ్రికానుంచి మనుషులను వేటాడి తీసుకు రావడం ఇవన్నీ కూడా పెట్టుబడిదారీ యుగోదయానికి ఉపకరించాయి" (పెట్టుబడి) అన్నారు.

భూస్వామ్య విధానం స్థానంలో పెట్టుబడిదారీ విధానం రావడం అనేది చారిత్రక అభివృద్ధే. కాని ఈ మార్పువల్ల దోపిడీ అంతం కాలేదు. ఒక దోపిడీవర్గం స్థానంలో మరో దోపిడీవర్గం వచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థ దాని రాజ్యాంగ యంత్రంకూడా శ్రామికవర్గం మీద ఎన్నో నిర్బంధాలు విధించాయి. సామ్రాజ్యవాదం ప్రపంచ మంతటా కూడా బలహీనపడుతోంది. అందుకే శ్రామిక, బూర్జువా వర్గాలు సంఘర్షణకు దిగాయి. నేటి ప్రపంచ చరిత్ర చదివి, మనం సంగతి సందర్భాలు తెలుసుకుంటే మనకి ఖచ్చితంగా తెలిసేదేమిటంటే పెట్టుబడిదారీ విధానం పతనం చెంది తీరుతుంది. అందుకే లెనిన్ "శ్రామిక సామాజిక విప్లవానికి సామ్రాజ్యవాదం నాంది" అన్నాడు. దోపిడీ విధానం అంతమొంది, మానవజాతి విముక్తిచెందే నవ్యజగత్తుకోసం వీరోచితంగా పోరాడేందుకు మనం ఉరకలు వేయాలి.

## సామ్రాజ్యవాద దేశాలమధ్య పెత్తనం కోసం పెనుగులాట

సామ్రాజ్యవాద దేశాలమధ్య సంఘర్షణ నేటి ప్రధానవైరుధ్యాల్లో ఒకటి. 19వ శతాబ్దం చివర్లోను, 20వ శతాబ్దం మొదట్లోను పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్య వాదంగా మారింది. పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా వుండే వైరుధ్యాలు ఈ దశలో మరింత తీవ్రరూపం ధరించాయి. ఒక్కమాటలో చెప్పాలంటే వలసదేశాల్లో వలుకుబడికోసం, పెత్తనంకోసం వాళ్ల కీచులాటలే ఈ వైరుధ్యాలు. లెనిన్ చెప్పాడు కూడా: "పెత్తనంకోసం అగ్రరాజ్యాల మధ్య పోటీయే సామ్రాజ్యవాద లక్షణం".

వలస సామ్రాజ్యవాద దేశాలమధ్య పోటీ నేటి ప్రపంచంలో అంతంకాలేదు. 17వ శతాబ్దంలో ఇంగ్లండుకు నెదర్లాండుకు మధ్య సముద్రాధిపత్యం కోసం పోటీ వుండేది. 18వ శతాబ్దంలో ఇంగ్లండుకు ఫ్రాన్సుకు మధ్య సముద్రాధిపత్యంకోసం, యూరప్‌లో పెత్తనం కోసం పోటీ వుండేది. 19వ శతాబ్దంలో యూరప్‌లో వింత పరిస్థితి తలఎత్తింది. ఇంగ్లండ్, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రియా ఆధిపత్యం కోసం కీచులాడుకునేవి. సామ్రాజ్యవాద దశకు చేరుకోగానే ఈ పోటీ మరింత తీవ్రమైంది. 20వ శతాబ్దం మొదట్లో ఇంగ్లండు జర్మనీలు పెత్తందారీ రాజ్యాలు. ఆ రెండు దేశాల మధ్య ప్రధాన వైరుధ్యం వుండేది. జర్మనీ, దోపిడీ రంగం మీదకి ఆలస్యంగా వచ్చినప్పటికీ మధ్య ప్రాచ్యంలోకి ఇతరచోట్లకీ త్వరగా విస్తరించింది. మధ్య ప్రాచ్యాన్ని ఆక్రమించడం ద్వారా ప్రపంచ పెత్తనాన్నాశించింది జర్మనీ. ఎందుకంటే మధ్య ప్రాచ్యం అటు యూరప్ ఇటు ఆసియా ఆఫ్రికా ఖండాలమధ్య ఇరుసులాంటిది. బ్రిటిష్, ఫ్రెంచి వలసలను కాజేయడానికి చాలా కీలకమైనస్థానంలో వుంది. అందువల్ల

మధ్య ప్రాచ్యం కోసం మొదటి నుంచీ సామ్రాజ్యవాదులు పోటీలుపడుతూనేవున్నారు. ఇంగ్లాండు యుద్ధంలో తన బలమైన వైరి జర్మనీని ఓడించి, టర్కీ చేతుల్లో నుంచి మెసపటోమియా పాలస్తీనాలను గుంజుకొని అరబ్బు ప్రజలను పాదాక్రాంతులను చేసుకుని, ఆఫ్రికా ఖండంలో తన వలసాధిపత్యాన్ని బలపర్చుకుంది. ఇతర సామ్రాజ్యవాద దేశాలు కూడా ప్రపంచాన్ని సంజుకు తినాలని ఎత్తులు వేస్తూనే వున్నాయి. వైరుధ్యాలు ఇలా పెరగడం వల్లనే 1914 లో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది, మానవాళిని కష్టాలపాలు చేసింది. కాని యుద్ధకాలంలో జర్మనీ, హంగరీ, టర్కీలలో విప్లవాలు లేచాయి. రష్యాలో జారు రాజ్యం తుడిచిపెట్టుకు పోయింది. జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ సామ్రాజ్యాలు కూడా అంతరించాయి.

చరిత్రను పరిశీలిస్తే ప్రపంచాధిపత్యంకోసం రెండు అగ్రరాజ్యాల పెనుగులాట మనకు బాగా అర్థం అవుతుంది. సామ్రాజ్యవాద దేశం, సోషల్ సామ్రాజ్యవాద దేశం కూడా ఆర్థిక సూత్రాలమీదే ఆధారపడి వుంటాయి. అసలు సామ్రాజ్యవాద స్వభావమే అంత. దాని పతనం తథ్యం.

అమెరికా, సామ్రాజ్యవాదరంగం మీదకు చాలా ఆలస్యంగా వచ్చింది. మొట్టమొదట్లో పెత్తనంకోసం అంతగా పెనుగులాడేది కాదు. ఎందుకంటే అమెరికాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయిన తీరే వేరు. లాటిన్ అమెరికామీద దురాక్రమణతో ఆరంభం చేసింది. 1898 స్పానిష్ అమెరికా యుద్ధం మొదలెట్టి జయించింది. వలసల పంపకంకోసం జరిగిన మొట్టమొదటి యుద్ధం అదే. పాశ్చాత్య ప్రపంచంలో అమెరికా సామ్రాజ్యవాదం ఉన్నట్టుండి పైకొచ్చేసింది. సామ్రాజ్యవాద దశలో అడుగెట్టిన మొదటి 30 ఏళ్లలోనే అమెరికా 33 చోట్ల జోక్యం కల్పించుకుని దురాక్రమణ చేసింది.

ఇతర సామ్రాజ్యవాద దేశాలతో పసిఫిక్ ఆసియా ప్రాంతాల్లో ఆధిపత్యంకోసం పోటీపడ్డం మొదలెట్టింది అమెరికా. వాటితో అప్పుడప్పుడు కుమ్మక్కయేది కూడా. కాని వాటి మధ్య తీవ్ర వైరుధ్యాలవల్ల 1941 లో జపాన్ సామ్రాజ్యవాదం పెరల్ హార్బర్‌పై దండెత్తింది. రెండు ప్రపంచ యుద్ధాల్లోనూ కూడా అమెరికా బాగా డబ్బు గడించింది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత బాగా బలపడి ప్రపంచం అంతటా తన విషపు నాల్కలు చాచింది అమెరికా. ఇతర దేశాల ప్రజలను ఆర్థికంగా దోపిడి చేస్తూ పెత్తందారీ పోకడలు పోయి వారి ఆంతరంగిక వ్యవహారాల్లో సాయుధ జోక్యం మొదలెట్టింది. కాని కాలం మారింది. యుద్ధానంతరం ఆసియా, ఆఫ్రికా, లాటిన్

లమెరికా దేశాల్లో కనీవినీ ఎరుగని రీతిలో ప్రజా వెల్లువలు వచ్చాయి. పెట్టుబడిదారీ విధానం పతనం మొదలైంది. అమెరికా ఇంటా బయటా కూడా వైరుధ్యాలు తీవ్ర మైనాయి. వీటన్నిటి వలన అమెరికా గద్దెమీదనుంచి గజగజా వణుకుతూంది.

ఆధునిక చరిత్ర చూస్తే, "ప్రపంచాధిపత్యం కోసం రష్యా తన పెనుగులాట ఎన్నడూ విడనాడలేదు" (ఎంగెల్సు). హంగరీ, పోలెండులలో విప్లవాలు అణచి, చైనా భూభాగాన్ని ఎద్దఎత్తున ఆక్రమించి 19వ శతాబ్దం చివరలో జారిస్టు రష్యా యూరప్ ఆసియాల్లో వలసరాజ్యం అయికూర్చుంది. మధ్య ప్రాచ్యంలో, బాల్కన్ ప్రాంతాల్లో ఆధిపత్యం చాలా కీలకమయిందని రష్యా అనుకుంది. తన నౌకా బలం పెంచుకుని బాల్టిక్ సముద్రం గుండా మెడిటరేనియన్ సముద్రాన్నికూడా అదుపు చేయా లని ప్రయత్నించింది. దురాక్రమణను, విస్తరణకు కొనసాగించడం కోసం విదేశాల్లో యుద్ధాలు మొదలెట్టింది రష్యా. ఆధిపత్యం కోసం జపాన్‌తో పోటీపడ్డ ఫలితంగానే 1904 రష్యా జపాన్ యుద్ధానికి దారితీసింది. ఓడిపోయిన జపాన్‌తో కలిసి ప్రపం చాన్ని విభజించి వాటాలు పంచుకుంది రష్యా. పాశ్చాత్య రంగంలో ఇంగ్లాండుతో చేతులుకలిపింది. ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, టిబెట్‌లలో పలుకుబడికోసం ఇంగ్లాండు రష్యాలు రహస్య సంధి చేసుకున్నాయి. చివరకు ఇరాన్‌లో విప్లవం అణచివేయడాని కని ఇద్దరూ కలసే సైన్యాలు కూడా పంపారు. కాని ఈ సామ్రాజ్యవాదాలు విప్లవ వెల్లువను ఆపలేకపోయాయి. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో విప్లవ పరిస్థితులు రష్యాలో త్వరత్వరగా అభివృద్ధి చెందాయి. సోషలిస్టు విప్లవ కేంద్రంగా రష్యా మారి పోయింది. ఇది సామ్రాజ్యవాదులకు చావుదెబ్బ. జారిస్టు రష్యా కలలు అంతమయ్యా యని చరిత్ర చాటిచెప్పింది. కాని అక్టోబరు సోషలిస్టు విప్లవ పంథాను విడనాడి, జారు సామ్రాజ్యవాదుల అడుగుజాడల్లో నడిచి క్రెమ్లిన్ అధినేతలు సోషల్ సామ్రాజ్యవాదు లుగా తయారయ్యారు. సామ్రాజ్యవాదం మొత్తంగా కూలిపోతున్న ఈ దశలో వలసాధిపత్యం కోసం తిరిగి ప్రయత్నించడం కేవలం పగటి కల.

గత చరిత్ర పరిశీలిస్తే మనకీ సంగతులు తేలిగ్గా తెలుస్తాయి. సామ్రాజ్యవాద దేశాలు పైకి కలిసికట్టుగా వున్నట్టు కనిపించినా అంతరంగిక వైరుధ్యాలు తప్పవు. వాళ్ల కుమ్మక్కయితే ప్రజలను మరింత దోచుకుతింటారు. వాళ్లమధ్య వైరుధ్యాలు ప్రజలకు తోడ్పడతాయి. వాళ్లమధ్య వైరుధ్యాలు విప్లవ ప్రజానీకం జాగ్రత్తగా పరిశీలించి వాటిని విడమర్చి సరయిన వర్గదృక్పథంనుంచి వాటిని మదింపువేయాలి. సామ్రాజ్యవాదులు ఉమ్మడిగా కొనసాగించే దోపిడీ, దురాక్రమణ, వాళ్లమధ్య

వైరుధ్యాలు ప్రజలలో తుఫాను రేకెత్తిస్తాయి. సామ్రాజ్యవాదాన్ని, వలసవిధానాన్ని, నయా వలసవిధానాన్ని కూలదోయడం ద్వారా మాత్రమే ప్రజలు భవిష్యత్తును తమ చేతుల్లోకి తీసుకొనగలుగుతారు.

## పీడన వున్నచోట ప్రతిఘటన తప్పదు

పీడన వున్నచోట ప్రతిఘటన వుంటుంది. శ్రామిక వర్గాలు, పీడిత దేశాలు, పెట్టుబడి వలస సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటాలు జరుపు తున్నారు. నేటి ప్రపంచ చరిత్రంతా పోరాటాలమయం. "కేవలం ప్రజలే చరిత్ర నిర్మాతలు, చరిత్ర చోదక శక్తులు" అనేది ముమ్మాటికీ సత్యం. ఈ మాట ఎన్నో సార్లు రుజువయింది. శ్రామికవర్గం 1848లో బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా పోరాటం మొదలెట్టి 1871లో పారిస్ కమ్యూన్‌లో ఎర్రజెండా ఎగరేయడం, రష్యాలో అక్టోబరు సోషలిస్టు విప్లవ విజయం, చైనా విప్లవ పురోగమనం— ఇవన్నీ కూడా కమ్యూనిస్టు ఉద్యమంలో భాగాలే. దేశదేశాల శ్రామికులూ ప్రపంచ ప్రజలూ రచించిన ఈ మహత్తర ఇతిహాసం నేటి రివిజనిజం దివాళాకోరుతనాన్ని చాటిచెబుతోంటి.

శ్రామిక విప్లవోద్యమాలకు సైదోడుగా పీడితజాతుల విమోచనోద్యమాలుకూడా చారిత్రిక శక్తిగా వృద్ధిచెందాయి. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా రంగాలలో నేరుగా సామ్రాజ్యవాదులమీద చావుదెబ్బ తీస్తున్నాయి. వలస, అర్ధవలస దేశాలకు, సామ్రాజ్యవాదానికీ మధ్య తీవ్ర వైరుధ్యాల ఫలితమే ఇదంతా. ఎన్నో చారిత్రిక దశలు గడిచాయి. ఈ సూత్రం ప్రకారమే విప్లవం పురోగమిస్తుంది. పీడన ఎంత ఎక్కువగా వుంటే ప్రతిఘటన కూడా అంత ఎక్కువగా వుంటుంది. చిరకాలం అణగారివుంటే ప్రతిఘటన పెల్లుబుకుతుంది. 15వ శతాబ్దం తరవాత కొద్దికాలంలోనే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు పెద్దపెట్టున దోపిడీకి పీడనకూ గురయాయి. వలస సామ్రాజ్యవాదాలకువ్యతిరేకంగా విప్లవపోరాటాలు ముందుకువచ్చాయి.

18వ శతాబ్దం చివర్లోను 19వ శతాబ్దం మొదట్లోను లాటిన్ అమెరికా దేశాల్లో పెద్దఎత్తున జాతీయ విమోచనోద్యమాలు చెలరేగాయి.... నీగ్రో బానిసలు ముందుకొచ్చి గొప్పగా పోరాడి 60,000 సైనికులను పదేళ్లలోనే హతమార్చారు; దురహంకారి నెపోలియన్ దురాక్రమణ సైన్యాలను లొంగదీశారు; 1804లో లాటిన్ అమెరికాలో మొదటి స్వతంత్రరాజ్యం నెలకొల్పారు. నీగ్రోలు వలస పాలన నుంచి, బానిసత్వం నుంచి విముక్తి పొందారు. దీని తర్వాత లాటిన్ అమెరికా దేశాల్లో చాలా చోట్ల స్పెయిన్ పోర్చుగల్ సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు లేచాయి. 19వ శతాబ్దం

మధ్యలో ఆసియాలో ప్రజలు మేల్కొన్నారు. వలస భూస్వామ్య విధానాలకు వ్యతిరేకంగా ఈ చివరనుంచి ఆ చివరిదాకా అంటే పర్షియన్ గల్ఫ్, ఇండియా చైనా అన్ని చోట్లా తిరుగుబాట్లు లేచాయి. ఎంతో విప్లవోత్సాహంతో మార్క్సు, ఎంగెల్సు ఇద్దరూ ఈ తిరుగుబాట్లను కొనియాడారు. ఎంగెల్సు చెప్పాడు కూడా: "ఆసియాలో వినాశనానికి నాంది". ఇండియా, వియత్నాం, కొరియా, ఫిలిప్పైన్స్, చైనా మున్నగు చోట్ల తుఫాను గాలులు వీచాయి. రష్యా అక్టోబరు సోషలిస్టు విప్లవం తరవాత ఇవి మరింతగా లేచాయి. దీనితో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మొత్తం ఆసియా ఖండం ఒక పెద్ద యుద్ధరంగంగా మారిపోయింది. ఆఫ్రికా నీగ్రోలు మామూలు బాణాలు విల్లంబులతో తిరగబడి మారణాయుధాలతో మధించివున్న సామ్రాజ్యవాదులను ఎదుర్కొన్నారు. రెండో ప్రపంచయుద్ధం తర్వాత ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికా దేశాలు ప్రధాన కేంద్రాలుగా రూపొందాయి. ఈనాటి ప్రపంచ వైరుధ్యాలు, వలస నయా వలస సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలు కూడా మనకు అక్కడే ఎక్కువగా పొడగడుతున్నాయి. ఒకరకంగా చూస్తే ఉత్తర ఐర్లండు, ఆఫ్రో అమెరికా దేశాలు పెట్టుబడిదారీ విధానాలకు పుట్టిళ్ళు. అలాంటిచోట్లే జాతీయ ప్రజాస్వామ్య విప్లవోద్యమాలు వ్యాపించడానికి ఎంతో చారిత్రక ప్రాధాన్యత వుంది. తరతరాల నుంచి కూడా ఆఫ్రో అమెరికా నీగ్రో జనానికి అమెరికా బూర్జువావర్గం అగర్భశత్రువు. రెండు కోట్ల ఆఫ్రో అమెరికా ప్రజానీకం అమెరికా సామ్రాజ్యవాదుల దోపిడీకి, పీడనకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. వాళ్ల పోరాటాలను వెనకేసుకొని మావో ఏమన్నాడో చూడండి. వలస సామ్రాజ్యవాదాలు నీగ్రోలను బానిసలుగా చేయడంతోనే మొదలయ్యాయి- వాళ్ల విముక్తికాగానే సామ్రాజ్యవాదం అంతరించిపోతుంది.

విప్లవం జయిస్తుంది

ఆధునిక చరిత్రగతి పరిశీలిస్తే ఓ సంగతి బోధపడుతుంది. దేశాలు స్వతంత్ర్యం కోరుతున్నాయి- జాతులు విముక్తి కోరుతున్నాయి- ప్రజలు విప్లవం కోరుతున్నారు. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల ప్రజలు వలస సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా పోరాడ్డం వల్లనే మూడో ప్రపంచం ఉద్భవించింది. మావో అన్నాడందుకే "సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే చారిత్రక యుగంలోకి ప్రజలను సామ్రాజ్యవాదమే నెట్టింది".

ప్రజలు విప్లవాన్ని కోరుతారు; విప్లవం విజయంపొంది తీరుతుంది. కాని విప్లవానిది మాత్రం తిన్నని దోవకాదు. ముళ్లు, రాళ్లు, అవాంతరాలెన్నోవున్నాయి. ఇది చారిత్రక గమనంలో ఇమిడివున్న గతితార్కిక సూత్రం. 1640లో మొదలైన బ్రిటిష్ బూర్జువా విప్లవం ఆధునిక చరిత్రలో అర్ధశతాబ్దంపాటు వంకరటింకరగా నడిచింది. అలాగే అమెరికా, ఫ్రాన్సుల బూర్జువా విప్లవాలు కూడా కొనసాగాయి. ఇలాంటి సుదీర్ఘ పోరాటాల తరవాతే ఆయా దేశాల్లో బూర్జువావర్గాలు తమ పెత్తనాన్ని పదిల

పద్చుకున్నాయి. ఇవాళ వలసదేశ ప్రజలు కూడా తమ స్వతంత్రం కోసం అలాగే పోరాడుతున్నారు. వలస సామ్రాజ్యవాదులు తమంతట తాముగా ఎన్నడూ గద్దెదిగరు. ప్రజల విప్లవాలకు రకరకాల ఆటంకాలు కల్పించడమే సామ్రాజ్యవాదుల పని. 19వ శతాబ్దంలో 20 ఏళ్లపాటు పోరాడినాకే అమెరికా ప్రజలు స్పానిష్ పోర్చుగల్ వలస పాలన నుంచి బయటపడ్డారు. కాని చాలా వలసదేశాలు రాజకీయ స్వాతంత్ర్యం పొందినాక కూడా బ్రిటిష్ వారి ఆర్థిక జోక్యం మూలాన నర్తక వలసలుగా మారిపోయాయి. పాన్ అమెరికా చాటుబల్ల (Sign Board) మాటున అమెరికా సామ్రాజ్యవాదం అదిరింపులతో బెదిరింపులతో అనేక లాటిన్ అమెరికాదేశాలను నయా వలసలుగా చేసింది.

ఈ చారిత్రక అనుభవాలన్నీ మనకు తెలియజేసే దేమిటంటే నిజమైన విప్లవం ఎప్పుడూ భీకర పోరాటాలతో నిండివుంటుంది. ఒకవేళ అలాంటి చికాకులు లేకుండానే విప్లవం విజయవంతం అయితే ఆ తరవాతయినా అలాంటి పోరాటాలు తప్పవు. బూర్జువా విప్లవాల పట్లే ఈ మాట నిజమైనప్పుడు శ్రామిక విప్లవ విజయాలను గురించి చెప్పనక్కరలేదు. మావో అన్నాడు: "రాజకీయ సైద్ధాంతిక తప్పొప్పులను బట్టే ఏ సంగతయినా నిర్ణయం అవుతుంది. సరయిన మార్క్సిస్టు-లెనినిస్టు పంథావుంటే శ్రామిక వర్గం, విప్లవ ప్రజానీకం ఎన్ని గండాలయినా గడపగలదు. శ్రామికవర్గ నియంతృత్వం క్రింద విప్లవాన్ని కొనసాగించడం" అనే మావో సిద్ధాంతం అతని విప్లవాత్మక పంథా, విధానాలు, నిరంతరం వర్గచైతన్యం పెంపొందించుకోవడం, రెండు పంథాల మధ్య పోరాటం, విప్లవం కొనసాగించే మన చైతన్యం, సామ్యవాద విప్లవాన్ని చివరి వరకూ సాగించడం ఇవన్నీ కూడా ప్రపంచ చరిత్ర చదివితే మనకు మరింత బాగా అర్థమవుతాయి.

భూస్వామ్య విధానం పోయి పెట్టుబడిదారీ విధానం వచ్చినట్టే, పెట్టుబడిదారీ విధానం పోయి సోషలిజం వస్తుంది. ఇది అప శక్యంగాని చారిత్రక సూత్రం. ఈ సూత్రానికి అనుగుణంగానే ప్రపంచ విప్లవ ప్రవాహం ముందుకు దూసుకుపోతుంది. ప్రపంచ పరిస్థితి అమోఘంగా వుంది. రెండు అగ్రరాజ్యాలు కొనసాగిస్తున్న దురాక్రమణ, దోపిడీలు ప్రపంచ ప్రజలలో ఆగ్రహం రేకెత్తిస్తున్నాయి. వాళ్లందరూ ఏకం అవుతున్నారు. ప్రపంచంలో ఏ శక్తీకూడా సామ్రాజ్యవాద పతనాన్ని ఆపలేదు. అలాగే ప్రజా విప్లవ విజయాన్ని అరికట్టలేదు.

లెనిన్ ఎప్పుడోచెప్పాడు: "దళిత ప్రజానీకం మేల్కొని చైతన్యంతో సామ్రాజ్యవాదులమీద తిరగబడి విముక్తి పోరాటాలు మొదలెట్టినప్పుడే ప్రపంచ చరిత్రలో కొత్తరోజు వస్తుంది". ఆరోజు రానేవచ్చింది. ఈ సంచలనాత్మక యుగంలో ప్రతి విప్లవకారుడూ ప్రపంచ చరిత్ర చదివి, దేశదేశాల ప్రజా పోరాటానుభవాల నుంచి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో పాఠాలు నేర్చుకోవాలి.

# రగులుకొనే రాక్షసి బొగ్గు

సురా

28, మే, 1977 భారతప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్ ఆఫీసు నుండి ఒక సర్క్యులర్ విద్యామంత్రి ఆఫీసుకు చేరింది. ఏడునెలలుగా సాగుతున్న ఎడతెగని వివాదం ఆరంభ మయింది. ఆ సర్క్యులర్‌లో కొన్ని చరిత్రపుస్తకాలు ఎన్.సి.ఇ.ఆర్.టి. (నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రిసర్చ్ అండ్ ట్రెయినింగ్) టెక్ట్స్ పుస్తకాల లిస్ట్ నుండి ఉపసంహరించవల్సిన అవసరముందేమో ఆలోచించమని సలహా ఇచ్చింది.

ఆ పుస్తకాలు :

1. మిడివల్ ఇండియా (రొమిల్లా థాపర్)
2. మోడరన్ ఇండియా (బిపిన్ చంద్ర)
3. కమ్యూనలిజమ్ అండ్ రైటింగ్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ (బిపిన్‌చంద్ర, హర్బన్‌ముఖియా, రొమిల్లా థాపర్)
4. ఫ్రీడమ్ స్ట్రగుల్ (బిపిన్‌చంద్ర, అమలెస్ త్రిపాఠీ, బరున్ డే)

అక్టోబర్‌లో అగ్నికి ఆజ్యంపోసినట్టు రష్యాలో జరిగే ఒక చరిత్రకారుల సమావేశానికి భారత ప్రతినిధివర్గం నాయకుడు, ఢిల్లీ విశ్వవిద్యాలయం చరిత్ర విభాగం అధిపతి, ప్రముఖ చరిత్రకారుడు ఆర్.ఎ. శర్మను మాస్కో వెళ్ళడానికి జనతా ప్రభుత్వం అనుమతి నిరాకరించింది.

ఈ వివాదం వెనక భారతదేశ చరిత్రను గురించి రెండు విభిన్నమైన దృక్పథాలు ఉన్నాయి. వివాదాస్పదమైన ఈ పుస్తకాలలో ముస్లిమ్ పాలకులు హిందూపాలకుల కంటె ఎక్కువ మతోన్మాదులు ఏమీకారని, బహుశ మొట్టమొదటిసారి, స్పష్టంగా చెప్పబడింది. భారతదేశ సాంఘిక సాంస్కృతిక పరిణామంలో ముస్లిమ్‌లకుండే ప్రముఖపాత్రను ఈ పుస్తకాలు గుర్తిస్తాయి. కేవలం మతం సంకుచిత దృష్టితో అక్కడక్కడ జరిగిన సంఘటనల ఆధారంగా చరిత్రకు అర్థం చెప్పే దృక్పథానికి ఈ పుస్తకాలు చావుదెబ్బతీసాయి. చరిత్రను పాలకుల చరిత్రగా కాక పాలకుల గాథల్ని చరిత్ర పరిణామక్రమంలో ఒక భాగంగా గుర్తిస్తూ ఈ పుస్తకాలు ఎంతోకాలంగా చరిత్ర పాఠ్య పుస్తకాలు సృష్టిస్తున్న భ్రమల్ని పోగొట్టడానికి నిజాయితీతో ప్రయత్నించాయి.

అయితే ఆర్.ఎస్.ఎస్, హిందూ మతోన్మాదులు సాంఘికంగానే కాక రాజకీయంగానూ, పరిపాలనా రంగంలోనూ ప్రజాభిప్రాయాన్ని శాసించే స్థాయిలో ఇవ్వాళ

ఉన్నారు. అందుకే పి. సి. చందర్ ఈ పుస్తకాలను ఉపసంహరించమని సలహా ఇవ్వగలడు. మొరార్జీదేశాయి ఆర్. ఎ. శర్మను రష్యా వెళ్ళనివ్వకుండా చెయ్యగలడు.

ఈ వివాదంలో తెరపై వైరుధ్యం స్పష్టమే. మతం కళ్ళల్లోంచి చరిత్రను చూసే గతించిన కాలపు నీడలకు- ప్రజల చెమట, కన్నీళ్ళు రక్తంతో పరిణమించిందిగా చరిత్రను గుర్తించే వామపక్షవాదులకు జరిగే నిరంతర సంఘర్షణ.

తెరవెనుక....

రాజకీయ పార్టీల భాగోతం చాలా ఉంది.

ఒకవైపు 'స్వాతంత్ర్య భారతాని'కి రెండోసారి 'స్వాతంత్ర్యం' సంపాదించానని చెప్తున్న పార్టీ ఎవరో ఒక మతవాది రాసిన లేఖ నాధారం చేసుకొని భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని అరికట్ట ప్రయత్నిస్తోంది. ఇది సమీప భవిష్యత్‌లో ఈ దేశప్రజలు చూడబోయే పరిపాలనకు ఒక స్పష్టమైన సూచిక.

మరోవైపు అత్యయిక పరిస్థితిలో పాలకవర్గ ప్రయోజనాల్ని కాక ఒక వ్యక్తి అధికార దాహాన్ని కూడా సమర్థించిన 'వామపక్ష మేధావులు' తమ ఉనికికి ప్రాణం పొయ్యడానికి చేస్తున్న ప్రయత్నంకూడా. అందుకే ఢిల్లీ విశ్వవిద్యాలయంలో కేవలం అభిప్రాయాలకోసం 228 మంది అధ్యాపకులు నిర్బంధింపబడుతుంటె చూస్తూఊరుకున్న ఆర్. ఎ. శర్మ, ఢిల్లీ విశ్వవిద్యాలయం హిస్టరీ డిపార్ట్‌మెంట్‌ని నూరుల్‌హసన్‌కి జేబు సంస్థను చేసిన ఆర్. ఎ. శర్మ, ఉత్తరాలకోసం వ్యాసాల కోసం కూడా మేధావులు బంధిఖానాకు గురికావాల్సిన చీకటి రోజులలో పరిపాలనను, పాలకులను సమర్థించిన ఆర్. ఎ. శర్మ- ఇవాళ భావప్రకటనా సాతంత్ర్యం గురించి మాట్లాడుతున్నాడు.

ప్రజాస్వామిక విలువలు అప్పుడు, ఇప్పుడూకూడా ఈ దేశంలో అధికారపార్టీలు తమ అవసరం కోసం వాడుకునే పావులుగా తప్ప మరేమీ కాకుండాపోయాయి. ఐనా చరిత్ర పాఠాలు చెప్పే మేధావులకి, చారిత్రిక పాఠాలు చెప్పగలమనుకునే పాలకులకి కూడా చరిత్ర పాఠాలు చెప్పగలదు- మార్క్సు మాటల్లో: "మానవులు తమ చరిత్ర తామే నిర్మించుకుంటారు. కాని అది తామెట్లా తలచుకుంటే అట్లా నిర్మించుకోలేరు. గతం నేరుగా యిచ్చే, గతంతో నేరుగా లభించే, గతం నేరుగా అందించే పరిస్థితుల్లో తప్ప తమకు తాము ఎంచుకున్న పరిస్థితుల్లో వాళ్ళు చరిత్రను నిర్మించలేరు".

### విరసం మహాసభలు

జనవరి 25, 26 తేదీలలో హైదరాబాదులో సమావేశమైన విరసం కార్యవర్గం ఉపాధ్యాయుల, విద్యార్థుల అనుకూలత దృష్ట్యా మహాసభలను మే నెలలో నిర్వహించాలని నిర్ణయించింది. తేదీలు ఆహ్వాన సంఘాన్ని సంప్రదించి త్వరలో కార్యదర్శి ప్రకటిస్తాడు.

# నీ బ్రతుకుతెరువుకు నీవు పోరాడు

ఉపాధ్యాయ

ఇన్నావె ఊరక్కా
కన్నావె కట్టన్న

మల్ల ఎన్నికలొచ్చె
మన ఊల్లోకి కారొచ్చె
నాటు సారా తెచ్చె
కలహాలు మనకు పెంచె

బస్తీలో పెదబాబు
మన పల్లె కచ్చాడట
ఎన్నికల్లో గెలిస్తే
ఎన్నెన్నొ చేస్తాడట

ఉన్నవాడి భూమి
లేనోల్ల కిస్తరట
లేనివాల్లందరికి
ఉద్యోగా లిస్తరట

పెరిగేటి ధరలను
అదుపు చేస్తారట
అదుపులేని అవినీతి
అంతం చేస్తారట

గౌర్మెంటు పనోల్లకు
జీతాలు పెంచారట
ఎన్నికలు అయినంక
కూల్నాలి పెంచుతరట

ఊరికి రోడ్డంట
ఊల్లోకి బస్సంట
కరంటు వచ్చునట
మన గుడిసెల్లొ వెలుగంట

అడిగినోల్లకప్పంట
బ్యాంకు లిస్తాయంట
భూమిమీద శిస్తు
మాపు చేస్తారంట

తాగెటోడు, లేనోడు
ఉండనే ఉండరట
అందరికి అనువైన
సమత తెస్తారట

పాడిందె పాడాడు
మన పల్లె దొరబాబు
ఐదేండ్ల కొకసారి
అ పాటె పాడుతరు

పనిలేక నీ కొడుకు
పట్నము పోతేను
దొంగాని పోలీసు
జైల్లో తోసిండు

ఓటు కెదిగిన బిడ్డ
నాటు వెయ్యబోతె
దొర చేతిలో నలిగి
చెరువులో పడిసచ్చె

కూలి అడుగబోతె
లేదుపొమ్మన్నాడు
అది ఏంది అంటేనూ
అగ్గిలో వేశాడు

సంటోన్ని సర్కారు
దవాఖాండ్లకు తెస్తె

లంచము ఇవ్వంది
పంచమివ్వమనిరి

"సర్కారు ఏంచేసె
మన బతుకేమి మార్చేసే"
అన్నోళ్ల చెట్లకు
కట్టి కాల్చేసె

కట్టగుడ్డలు లేక
పొట్టకూటికి లేక
ఉండ ఇల్లు లేక
ఉండేవు ఎన్నాళ్లు?

ఎన్నికల పండుగా
ఎన్నిమార్లచ్చినా
ఏమైన మారెనా
నాయకులు తప్ప

నీ ఓటుకు పుట్టినోడు
నీకు మేల్జేయడు
నీ బ్రతుకుతెరువుకు
నీవు పోరాడు–

## కంపెనీలో కూలోడా!

ఎ. అప్పల్నాయ్డు

దిక్కులేక
కంపెనీలో....
రెక్కలమ్మి
బతుకుతున్న
కూలోడా!
కార్మికుడా!
కళ్లు విప్పి చూడరా!
హక్కులకై పోరాడరా!

తొలివేకువ జాములోన
చలితోటి లేస్తాము
గంజాము లేబర్లం
గనుల్లోన నిలుస్తాము
టీ నీళ్ళకు నోచుకోము
పాచి మొహం కడుక్కోము ॥దిక్కు॥

కాసులోడు కంట్రాక్టరు
హైక్లాసు గదిలోన
ఉన్ని రగ్గు.... మఫ్లేరు
ఒళ్ళంతా చుట్టుకునీ
బీరుమీద బీరుతాగి
పరుపుమీద దొర్లుతాడు ॥దిక్కు॥

కండ పిండి కూలోల్లం
ఎండల్లో మాడుతుంటే
కారులోన కాంట్రాక్టరు
కళ్లురుముతు వొస్తాడు
లోడు తక్కువంటాడు
లేబర్లను తిడతాడు ॥దిక్కు॥

కూలి రేటు పెంచమంటె
పనిలేదు పొమ్మంటడు
పని గంటలు పదహారు
చెయలేము మేమంటే
దునియాలో కూలోల్లు
కరువు కాదు పొమ్మంటడు ॥దిక్కు॥

మన కష్ట ఫలంతో వాడు
కంపెనీలు కట్టాడు
మన కండ బలం కాచేసి
కార్లు మేడలు కొన్నాడు
మన రక్తం పిండేసి
బాంకుల్లో దాచాడు ॥దిక్కు॥

కూడులేక కుములొద్దు
మన హక్కులు విడవొద్దు
శ్రమచేసే మనమంతా
యేకమయి పోరుదాం ॥దిక్కు॥

కాంట్రాక్టరు దోపిడీని
ఎదిరించి నిలుద్దాం ॥దిక్కు॥

# దరి

కె. వి. యస్.

"నట్టనడి సంద్రాన
నావ పోతున్నాది
దిస కానరాకుంది
తెరచాప లేకుంది
దారెట్ల తెలిసేది
అన్నయ్యా!
దరికెట్లచేరేది అన్నయ్యా"

తూరుపు దిక్కున
ఎరుపెక్కుతున్నాది
ఎర్రెర్రని పొద్దు
ఎదురవ్వుతున్నాది
ఎర్రని వెలుగుల్లో చెల్లెలా!
నావ దరిజేర్చవే చెల్లెలా!
గుండెను పలిచేసి
తెరచాప చేశేయి
తనువును బలిచేసి
చుక్కాని చేశేయి
బలిదానమూలేక చెల్లెలా!
నావ దరిజేరదు చెల్లెలా!

"జడివాన వస్తాంది
సుడిగాలి వీస్తాంది
అల పొంగుతున్నాది
నావొంగుతున్నాది
నావెట్లునడిచేను అన్నయా!
దోవెట్లుతెలిసేను అన్నయా!"

"జడివాన రానిమ్మ
సుడిగాలి రానిమ్మ
అల పొంగి రానీయి
నావొంగి పోనీయి
గుండెల్లో గుబులు చెల్లెలా!
గుడికట్టుకోనీకు చెల్లెలా!
సుడిగాలి కెదురుగా
దిశను మళ్ళించాలి
నురుగుల్లో పరుగుల్లో
నావ నడిపించాలి
ఆత్మవిశ్వాసమ్మె చెల్లెలా!
నీనావ నడిపించు చెల్లెలా!"

"ఎంత నడిచినగాని
దరి కాన రాకుంది
ఇంకెంత కాలమో
ఇది తెలియరాకుంది
దరిచేరెదెప్పుడూ అన్నయ్యా!
ఇది కడతేరెదెప్పుడూఅన్నయ్యా"

"నిముష నిముషమ్మ
కాలమే తరిగేను
నడిచి నడిచి తాను
నావ దరిజేరేను
చింతించకే నీవు చెల్లెలా!
ఇక్కట్లు తొలిగేను చెల్లెలా!

పొద్దుపొడుపదిగో
పొడుచుకొని వస్తాంది
దారి కన్పిస్తాంది
దరి చేరువౌతుంది
ఈ నావ దరిచేరు చెల్లెలా!
ఇడుములే కడతేరు చెల్లెలా!"

## తుఫాను పాట

రుద్రజ్వాల

(ఓ.... గుర్రాలా గోపిరెడ్డీ దాచేపల్లికి దహనమైతివా అనే బాణీలో)

ఓ.... కోస్తాతీరం పేదన్నయ్యా
తుఫానులో చిక్కుకు పోయావా
నువ్వు తుఫానుకే బలిచేయ బడ్డావా

ఓట్లకోసం యిల్లిల్లు తిరిగే
సర్కారోల్లూ సోజెం జూత్తే
దిక్కులేకా వెక్కి యేడ్చావా....
ఏడ్చి ఏడ్చి ఒరిగి పొయ్యావా.... ఓ॥

పంటగాసే ముసలితండ్రీ
కూలికెల్లిన తల్లీ, తమ్ముడు
ఏమయిర్రో అని కన్నీరిడిశావా....
ఎదురుజూత్తా కళ్లే మూశావా.... ఓ॥

ఒడ్చిపడ్తే ఉప్పెన రక్కసి
ఆలూబిడ్డలు గొల్లుమంటే
కావిటిచ్చుక గిజగిజలాడావా....
గుంజుకలాడీ కొనూపిరొదిలావా.... ఓ॥

దివిసీమా దివిసీమేయని
శిస్తు లెవీలకు సెవులూ పిండి
దివి సీమను దివికే వదిలారా....
దివి నుంచే చిత్రం చూశారా....
ఈ దయగల్ల పెబువులు
కుర్సీలకే కొట్లాడుకున్నారా.... ఓ॥

గడియ గడియా గండంజేసీ
జలగుండంలో తోసిన హత్యకు
నీదుపర్గం సెల్లెలు, తమ్ముడు....
ఎర్ర ముంపై కసిదీర్చుకుంటారు....ఓ॥

వెల్వడింది :

తుఫాను - (బుర్రకథ)

వెల : 0-75 పై.

ప్రతులకు : సహోదయ సాంస్కృతిక సంస్థ
2-1-1/5 నల్లకుంట, హైదరాబాద్ - 500 044.

# ఉప్పెన: తుఫాను - ఒక రిపోర్టు

(గత సంచిక తరువాయి)

పాలకాయతిప్ప ఉల్లిపాలెం హ్యామ్లెట్- సముద్రతీరం. అందువల్ల ఉప్పెన వల్ల పూర్తిగా తుడిచిపెట్టుకపోయింది. ఇక్కడ మాకు దూరం నుంచి తెల్లని మేడల్లా కనిపించినవి స్విట్జర్లాండుకు చెందిన రెడ్‌క్రాస్ గుర్తులుగల టెంట్లు. ఈ టెంట్లు వేసినవారు జె. ఎన్. యు. విద్యార్థులు. మేం వెళ్ళిన కాసేపటికే సెంట్రల్ వాటర్ పవర్ కమీషన్‌వాళ్ళు మూడు నాలుగు జీపుల్లో హడావుడిగా వచ్చారు. ప్రజల వైపయినా చూడకుండా తీరం వైపు వెళ్ళారు. ఏవో సాంకేతిక విషయాలు తమలో తాము చర్చించుకున్నారు. తమకు కావలసిన సమాధానాలు రాబట్టుకోవడానికి ప్రయత్నించారు. 'నో, నో- యింపాజిబుల్' అంటూ తల అడ్డంగా తిప్పుతూ జీపులెక్కారు. అక్కడవున్న ఒ పి డి ఆర్ కార్యకర్తలు వెంటబడి ఎన్నో విషయాలు వివరించారు. కాని వాళ్ళకసలు కాగితాలు, ప్లాన్‌లు మినహా మానవ సమస్యలే అర్థమైనట్లు, పట్టినట్లు మా కనిపించలేదు. మేం ప్రవేశించిన దగ్గరనుంచీ తిరిగి వచ్చేవరకు ఇక్కడ ఏదో ఒక గుడారం నుంచి గుండెలవిసే శోకం వినొస్తూనే వుంది. ఈవూళ్ళో మిగిలింది ఒక బడి- ఒక చిన్న గుడి. బతికినవాళ్ళు కొద్దోగొప్పో ఈ బడిలో తలదాచుకున్నవారే. కొక్కిలగడ్డ నరసింహులు తన అనుభవం ఇట్లా చెప్పాడు: "వలలతో తాళ్ళతో గుడిసెలు కప్పుతున్నాం. సాయంత్రం 5 గం॥కు 50, 60 మందిమి ఒక యింట్లో చేరినం. ఇంతలో నీరువచ్చింది. సాయంకాలానికి ఆ యిల్లు కదిలింది. ఇల్లు గంటసేపు నీళ్ళలో తిరిగింది. ఎవరికి వాళ్ళమయ్యాం. ఒంటిగాణ్ణయ్యాను. కాసేపట్లో నా కొడుకు కనిపించాడు. ఇంకో యిద్దరు మనుషులు కనిపించారు. ఆడ మనిషి భారతి కనిపించింది. ఇంటి నడికొప్పు మీద (top of the house) ఎక్కాం. గంటసేపటికి నడికొప్పు పగిలింది. కృష్ణ లాగుతుంది. ఇంతలో ఒక గుబురు వస్తున్నది. ధైర్యం వచ్చింది. చెట్టుకు తెప్ప అడ్డం పడింది. పిల్లలు విడిపోయారు. ఆరుగురు పిల్లలు చనిపోయారు. ఒక కొడుకు, కూతురు మిగిలారు. భార్య చనిపోయింది".

చెన్ను ముత్యాలు కథ జీవిత మెంత కఠినమయిందో, ఎంత క్రూరమయిందో స్వార్థం ఎలాంటి ప్రేరణశక్తో (motive force) నిరూపిస్తుంది. "పొద్దున గాలి మొదలయింది. ఇల్లు, వలలు సరిచేసుకొంటున్నాం. మొదట్లో నీరు నడుముదాకా వచ్చింది. స్కూలుకు వచ్చాం. కరకట్ట మొదటి దెబ్బకే లేచిపోయింది. రెండవ వాగ 6 గం॥ ప్రాంతంలో, మూడవ వాగ 9 గం॥ ప్రాంతంలో వచ్చింది. మా వూళ్ళో రేడియో

లేదు. స్కూల్లోకి 250 మంది వచ్చారు. తలుపులు, కిటికీలు కొట్టుకొని, అవి పగిలి పోతే కొందరు జారిపోయారు. పైకప్పుకు ఐదుగురు కుర్రాళ్ళు ఎక్కారు. మొత్తం మీద 50, 60 మంది మిగిలారు. బడిలోనే వుంటూ చదువు చెప్పే టీచర్ చనిపో యింది. శుక్రవారం సముద్రం వేటకు పోలేదు. నా 13 సంవత్సరాల పెద్దబ్బాయి కిటికీ చువ్వలు పట్టుకొని చూస్తూవుండగానే జారిపోయి నీళ్ళల్లో కొట్టుకపోయాడు. చిన్నబ్బాయి 10 సం॥ వాణ్ని నెత్తిన గుర్రం ఎక్కించుకున్నాను. పైనున్న వాళ్ళు కిందికి తోస్తున్నారు. కిందివాళ్ళు కాలుపట్టి లాగుతున్నారు. ఊపిరాడడం లేదు. ప్రాణాలు పోతున్నాయి. పిల్లవాడు గట్టిగా వెంట్రుకలు పట్టుకొని వదలడంలేదు. పైవాళ్ళ తొక్కేస్తుంటే గుర్రం ఎక్కించుకున్న పిల్లవాణ్ని చేజేతులా బలవంతంగా వెంట్రుకలు వదిలించుకుని విసిరేసాను_ బయటపడ్డాను. నా బిడ్డ ఏడుస్తూ పోయాడు_ నా కళ్ళముందే పోయాడు. నేను ఏడుస్తూ మిగిలాను".

పాలకాయతిప్ప గ్రామానికి (ఉప్పెనకన్నా ముందు గ్రామం వున్నచోటికి) డిసెం బర్ 4న జె ఎన్ యు నుంచి 10 మంది ఆర్ ఎస్ సి విద్యార్థులు వచ్చారు. అప్పుడా ప్రాంతమంతా నిర్మానుష్యం. రోడ్డులేదు_ దారిలేదు. హంసల దీవిలో శిబిరం ఏర్పాటుచేసుకొని వాళ్ళు స్వయంగా పాలకాయతిప్పకు రోడ్డు వేశారు. రెండు వంతె నలు నిర్మించారు. ఇపుడింకా సాగుతున్న రోడ్డు నిర్మాణంలో కార్మికులు కూడ పాల్గొంటున్నారు. హంసలదీవి నుంచి తాగేనీరు తెచ్చారు. పాలకాయతిప్పలో టెంట్లు వేసి 14వ తేదీ రాత్రి తాము అక్కడ నిద్రించి 15న హంసలదీవిలోనూ, కోడూరు లాంటి చోట్లవున్న ఆ గ్రామస్తులను ఊరడించి, ఆశ్వాసించి, ప్రోత్సహించి తీసుక వచ్చారు. ఈ పదిమందీ యింకా పాలకాయతిప్పలో వుండి ప్రజల్లో కలిసిపోయి సేవ చేస్తున్నారు. వీరిలో ఒక డాక్టరున్నాడు_ ఇద్దరు అమ్మాయిలున్నారు. శ్యామల ఇదివరలో ప్రగతిశీల మహిళా సంఘం (పి ఒ డబ్ల్యు) హైదరాబాద్‌లో పని చేసిందట. నలుగురయిదుగురు తెలుగువాళ్ళున్నారు. హంసలదీవిలోని దేవునికి మొక్కుకోవడానికి కోడూరు నుంచి ఒక ఆఫీసర్ వస్తే ఆమె అడిగిందట 'మీరు పాపం చేసివుండవచ్చు, నేను పాపంచేసి వుండవచ్చు. మీరు ఆ పాపం పోవడానికి ఈ దేవునికి మొక్కుకోవడా నికి వచ్చారు_ మరి ఈ దివిసీమ పేదప్రజలు ఏం పాపంచేసారు ?' అని. ఆ ఆఫీసరు దగ్గర ఏం జవాబుంది_ ఇంకా కరప్షన్ అనే పాపం కొనసాగిస్తూ దేవునికి పాలుపం చివ్వడానికి వచ్చాడు తప్ప. పాలకాయతిప్పలో ప్రభుత్వంది కానీ, స్వచ్ఛంద సంస్థ లది కానీ పంపిణీ అంతా ఈ విద్యార్థుల ద్వారానే జరుగుతుంది. వీళ్ళక్కడ ప్రజల హృదయాల్లో అంతగా చోటుచేసుకున్నారు. పిల్లలకు పలకలు కొనిచ్చి చదువు కూడ

నేర్పుతున్నారు. వైద్యం, ఇతర సేవలు సరేసరి. ఒ పి డి ఆర్ కార్యకర్తలు, గ్రామీణ పేదల సంఘం ఇక్కడి పల్లెల్లో ఆత్మవిశ్వాసాన్ని, ధైర్యాన్ని ప్రోదిజేసి తమ హక్కులను డిమాండుచేసి ప్రభుత్వంనుంచి సాధించుకొమ్మంటున్నారు. పాలకాయతిప్ప అంటే ప్రజలకు పోరాటఆదర్శంగా ప్రభుత్వానికి పక్కలొబెదురుగామారింది. జె ఎన్ యు – ఆర్ ఎస్ సి విద్యార్థుల ఆదర్శ సేవను అందరూ గుర్తిస్తున్నారు. వీళ్ళలో ఒక పంజాబీ కవి వున్నాడు. ఆయనను ఇంటర్వ్యూ చేసాం. ఆయన గుంటూరు తుఫాను ప్రాంతం కూడ తిరిగివచ్చాడు. "గుంటూరు ప్రాంతంలో అధికారుల అవినీతి, లంచ గొండితనం చాల ఎక్కువగా వుంది. ఇక్కడ జనం వేయికళ్ళతో కనిపెడుతున్నారు. అంతటా వైద్యసౌకర్యం సంతృప్తికరంగానే వుంది. అయితే ఇది ప్రభుత్వం నుండి వచ్చింది కాదు. మేం విన్నదేమంటే దివిసీమకు వరంగల్, గుంటూరు, హైదరాబాదుల నుంచి సకాలానికి వైద్య బృందాలు వచ్చి టీకాలు వేసారట. లేకపోతే కలరాలాంటి అంటువ్యాధులు వచ్చి చాలామంది మిగిలినవాళ్లు కూడ పోయేవారు". అప్పుడు మాతో వున్న వైద్యబృందాన్ని పరిచయం చేసాం "వీళ్లే హంసపురం, ఉల్లిపాలెం ప్రాంతాలలో నవంబర్ 24 ననే వైద్య చికిత్స, టీకాలు యిచ్చిన వారు"ని. ఆ జె ఎన్ యు బృందం లోని డాక్టర్ ఎంతో పొంగిపోయి అభినందించాడు. "నిజంగా ఘోరక్కడ అంటువ్యాధులు రాకుండా ఆపినవారు" అని హర్షాతిరేకం ప్రకటించాడు.

గుంటూరు ప్రాంతంలో సంఘటన, సమీకరణ తక్కువగా వుంది. ఇక్కడ అది ఒక నిర్మాణరూపంలో వుంది. అక్కడ గ్రామాల్లో ఏ సంస్థా పనిచేయడంలేదు. మతాం తరం పొందిన కన్‌వర్ట్‌లువున్నచోట అంతర్జాతీయ సంస్థలు, చర్చి పని చేస్తున్నాయి.

"అక్కడ జరుగుతున్న అవినీతి, లంచగొండితనం అధికభాగం గ్రామ మునస బులు చేస్తున్నారు. వాళ్లు పరి రెవెన్యూ అధికారులతో పంచుకుంటున్నారేమో తెలి యదు- పంచుకుంటున్నారనే అనుకుంటాను" అన్నాడా పంజాబీ కవి చమన్‌లాల్ ప్రభాకర్.

మేమక్కడ వుండగానే ఢిల్లీ యూనివర్సిటీ విద్యార్థులు వచ్చారు. వీళ్లంతా అండర్‌గ్రాడ్యుయేట్ విద్యార్థులు. జె ఎన్ యు వాళ్లంతా పి జి విద్యార్థులు. ఢిల్లీ విద్యార్థులను ఈ ప్రాంతాలకు ప్రోత్సహించి తీసుకవచ్చింది ఢిల్లీ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న విరసం సభ్యుడు, ఢిల్లీ పి యు సి ఎల్ క్రియాశీల కార్యకర్త సి. వి. సుబ్బారావు. బందరు ప్రాంతం తిరిగి ఇటు వచ్చారు వాళ్లు. విజయవాడ కలెక్టర్ అరోరా వీళ్లను గైడ్ చేయవల్సిందిగా ఉత్తరం ఇచ్చినా

లవనిగడ్డలోవున్న క్యాంప్ ఆఫీసరు ఇక్కడసలు సహాయకార్యక్రమాల అవసరం తీరిపో యిందని దురుసుగామాట్లాడి ఢిల్లీ అంతదూరంనుంచి వచ్చిన పీళ్లపై చన్నీళ్లు చల్లాడు. ఆ రాత్రి అవనిగడ్డలోనే తలదాచుకొని తెల్లవారి ఇక వాళ్లంతటవాళ్లే బయల్దేరివచ్చారు. ముప్పై ఏళ్లగా ఏటా ఎనిమిది కోట్ల నష్టం వస్తుందట తీరప్రాంతాల్లో తుఫానులాంటి ఉపద్రవాలతో. మరి ముప్పై సంవత్సరాలుగా ప్రతీ ఏటా తప్పని ప్రకృతివైపరీత్యాన్ని నిరోధించడంలో ప్రభుత్వం ఏంచేస్తున్నట్టు? సుప్రసిద్ధ కార్టూనిస్టు అబూ రాసినట్లు ఏటా కోట్ల రూపాయల విదేశీ మారకద్రవ్యం ఆర్జించి పెడుతున్న ఈ తీరప్రాంత ప్రజల, పల్లెకారుల జీవితాలు ఇంత నికృష్టంగా ఎందుకున్నట్లు? ప్రతి సంవత్సరమూ ఈ ఉప్పెన వల్లా కూడ చనిపోయినవారు, నష్టపోయినవారు, నిరాశ్రయులైనవారు పల్లె కారులు, హరిజనులు లాంటి పేదలే. అంటే ప్రకృతి పేదలపట్ల వివక్ష చూపడం కాదు– ఈ వ్యవస్థ చూపుతున్న వివక్షతవల్ల ప్రకృతి వైపరీత్యాలకు కూడ పేదలు బలి యవుతున్నారు. దోపిడీ ఆర్థికవిధానమే కాదు, ఇందులో దోపిడీ సంస్కృతి ప్రభావం కూడ వుంది. పల్లెకారులు, హరిజనులు ఊరికి దూరంగా, తీరప్రాంతంలో వుంటారు. అది దిగువన పల్లంలో వుంటుంది. ఉప్పెన రోజు పీళ్లు ఊళ్లోకి రాలేకపోయారు. మళ్లీ ఇప్పుడు పీళ్లకోసం కమ్యూనిటీ హాల్ లాంటివి ఊరికి ఎడంగా కట్టినా అదే ఫలిత ముంటుంది. పీళ్లకు కూడ వూళ్లలో తక్కిన వర్ణాలతో, వర్గాలతోపాటుగా పునరావాసం కల్పిస్తే తప్ప రక్షణలేదు. అంతటా మామూలు స్థితి ఏర్పడిందని రేషన్‌లు ఆపేస్తు న్నారు. బియ్యం, పాలు పగయిరా పంచడం మానేసారు. ఇంకా శవాలు మిగిలి ఉప్పెన బీభత్సం, దుర్గంధంవేస్తున్న ఎన్నికల కోలాహలంలో ప్రభుత్వం బుకాయింపును తిప్పికొట్టగల ప్రజాసమీకరణ, సంఘటన తప్ప ఈ ఉప్పెనను ఏదీ అరికట్టజాలదు.

పాలకాయతిప్ప నుంచి హంసలదీవి మీదుగా దిండిమెరకకు తిరిగి వచ్చాం. అక్కడి నుండి మా దళం మూడుగా విడిపోయి ఆ ప్రాంతాలను చూస్తే తప్ప మరింత విస్తృతమైన ఏరియాను కవర్‌చేయలేమని అనుకున్నాం. ఒక దళం అధ్యయన పరిశీ లన బృందంగా కట్టకు అవలవున్న గొల్లపాలెం మొదలయిన ప్రాంతాలకు వెళ్ళాలని, ఒక దళం, ముఖ్యంగా వైద్యబృందం కోడూరుకు వెళ్లి ఒ పి డి ఆర్ నిర్వహిస్తున్న ఉచిత వైద్య శిబిరంలో పనిచేయాలని, ఇంకొక దళం గుంటూరుకు వెళ్లాలని నిర్ణయించు కున్నాం. ఈ నిర్ణయం మేరకు 20వ తేదీ ఉదయం వైద్యబృందంతో పాటు నేను కోడూరు బయల్దేరాను. మావెంట నెలరోజులుగా ఇక్కడ అహోరాత్రాలు పనిచేస్తున్న ఒ పి డి ఆర్ కార్యకర్త వుంది. ఆ కట్టమీద నడుస్తూవుంటే ఆమెచెప్పింది: '24 నవం బర్‌న మేం వచ్చినపుడు ఈ కట్టవెంబడి వరుసగా శవాలే– ఆ దృశ్యాన్ని, వాసనను

భరించలేక మేం పరుగెత్తాం' అని. కోడూరులో మా వరంగల్ వైద్యబృందం వైద్య సేవ కుపక్రమించారు. నేనూ, ఆ ఒ పి డి ఆర్ కార్యకర్త విజయవాడకు బయల్దేరాం. ఆమె కోడూరు ఫిర్కావాళ్లకు రేషన్‌లు వగైరా సరిగా అందడం లేదని స్పెషల్ ఆఫీస ర్‌కు మెమొరాండం ఇవ్వడానికి బయల్దేరింది. అట్లా గ్రామగ్రామానికి కనీసం ఒక్కరి చొప్పున గ్రామీణ పేదల సంఘం కార్యకర్తలున్నారు. వీళ్లకున్న ఒకే ఒక్క ప్రయాణ సౌకర్యం రెండు కాళ్లు. ఎన్ని బరువులైనా మోసుకొని కాలినడకన, కాదు పరుగులతో తిరుగుతున్నారు. వీళ్లలో స్త్రీలూ వున్నారు, వృద్ధులూ వున్నారు.

విజయవాడలో బందరు ప్రాంతాల అనుభవాలు ఢిల్లీ విరసం సుబ్బారావు, కోడూరు అనుభవాలు నేనూ చెప్పుకున్నాం. అక్కడి నుంచి గుంటూరు వెళ్లాను. గుంటూరు విరసం బాధ్యుడు రాంప్రసాద్ అక్కడి రిపోర్టిచ్చాడు. అక్కడ నష్టమంతా తుఫానువల్ల వచ్చింది. ఇంకా గుంటూరు నగరానికి తుఫాను దెబ్బ నుంచి స్పృహ రాలేదు. ఎన్నో చోట్ల యింకా విద్యుత్తురాలేదు. ఈ నగరంలో రెండువేల మంది చనిపోయారు. చనిపోయినవాళ్లు అందరూ కార్మికులే. పొగాకు కంపెనీల్లో, జనప నార మిల్లుల్లో పనిచేసే కార్మికులు. ఒక్క నల్లచెరువు ప్రాంతంలోనే 1500 మంది చనిపోయారు. వీళ్లకు పునరావాసం, సహాయం విషయంలో విరసం, ఎం.ఎల్. కార్యకర్తలు ఎంతో చురుకుగా పనిచేసారు. స్థానికంగా వున్న ఎన్నో స్వఛ్ఛంద సంస్థలు వీళ్లద్వారానే కార్మికులకు తమ సహాయాన్ని పంపిణీచేయించాయి. ఇక్కడ తెలిసిన ఒక్క విచిత్రమైన విషయం ఏమిటంటే ఇందిరాగాంధీ ఓడిపోయినందువల్లనే ఈ తుఫాను వచ్చిందని పేదవర్గాల జనం అనుకుంటున్నారు. ఆమె ప్రధానిగా వుండి వుంటే పేదల పునరావాసం విషయంలో ఇంత జాప్యం, అలక్ష్యం జరిగివుండేదా అని కూడ అనుకుంటున్నారట. ఆమె గుంటూరుకు వచ్చినప్పుడు నిముషాలల్లో వేలాదిజనం గుమికూడి హార్థికమైన స్వాగతం ఇచ్చారట. దేశానికి తుఫాను బీభత్సమే కాదు, ఇందిరా భ్రమోత్పాతం కూడ ఇంకా తొలగలేదనడానికి ఇంతకన్నా ఏం నిదర్శనం కావాలి? పేదలు ఇందిరను ప్రేమించేస్థితి ఇంకా ఈ దేశంలో వున్నదంటే కళ్ళు తెర వాల్సింది కమ్యూనిస్టులు (ఇందిర అభ్యుదయ వర్గాల నాయకురాలని నిన్నటిదాకా అన్న తెల్లకమ్యూనిస్టులు కాదు) ఇందిరా నియంతృత్వాన్ని ఎదుర్కొన్న కమ్యూనిస్టులు. ఇందిరాగాంధీ ఇరవై సూత్రాలు, సామ్యవాద పదజాలమూ వల్లించి, భూసంస్కరణల కల్లబొల్లి కబుర్లు చెప్పి పేదవర్గాల్లో ఏదో ఒకమేరకు ఇంకా భ్రమలను కల్పించగలుగు తున్నదంటే ఆ పేదల మధ్యన చైతన్యయుతమైన నిర్మాణాత్మక కృషిచేయడంలో

కమ్యూనిస్టులు చేయవలసినంత చేయకపోవడమేనని అనిపించింది. అయితే అట్లా ప్రజలకు సేవ చేస్తున్న కమ్యూనిస్టులున్నారు. వాళ్ళపైన వారంట్లున్నాయి. కేసు లున్నాయి. వాళ్ళ ప్రజలకు స్వేచ్ఛగా, యథేచ్ఛగా సేవచేయడానికి వీలుగా వాళ్ళపై వున్న వారంట్లు రద్దు చేసుకొని, కేసులు ఉపసంహరించుకోవాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయవలిసిన బాధ్యత ప్రజాస్వామ్యవాదులపై వుంది. అంతేకాదు ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ జెయిళ్ళలో మగ్గుతున్న వందలాది రాజకీయ ఖయిదీలుకూడ ఈ ఉప్పెన ముప్పుకు బలియైన తమ ప్రజల గురించి తల్లడిల్లుతున్నారు. వాళ్ళ వద్దకు వెళ్ళి తమ పేదప్రజల మధ్యన పని చేయడానికి సంసిద్ధంగా వున్నారు. నక్సలైట్లను 'ప్రజా ప్రవాహం' (మెయిన్‌స్ట్రీమ్)లో చేరవలసిందిగా విజ్ఞప్తులు చేస్తున్న ప్రభుత్వం ప్రవాహం ప్రమాదానికి గురియైన ప్రజలకు స్వచ్ఛంద సేవ చేసే తక్షణ కర్తవ్యాన్ని నిర్వహించడానికి తహతహలాడుతున్న ప్రజాసేవకులను బేషరతుగా వదిలిపెట్టాలని డిమాండ్ చేయాలి.

— **పరిశీలకుడు**

## ఉప్పెన మరి కొన్ని గ్రామాల రిపోర్టు

20-12-77 న మా టీము దింటిమెరక నుండి ఉదయం సుమారు 9 గం॥కు బయలుదేరి కాలినడకన ద్వారక చేరుకున్నది. ద్వారక ప్రవేశంలోనే మురుగునీటి కాలువలో ఒక స్త్రీ శవం కనిపించింది. ఈ చిన్న గ్రామం జనాభా సుమారు 300. అందులో 200 మంది దాకా వరదపాలైనారు. చనిపోయినవారు ఎక్కువగా హరిజనులు, కాపులు- ఇళ్ల 60 నామరూపాల్లేకుండా పోయినయ్- ధాన్యం కొంత పొలాల్లో మిగిలి ఉంది- ఉప్పుడు బియ్యానికి మాత్రం పనికివస్తుంది. ప్రభుత్వ సహాయం ఏమీలేదు- నెల పేరిట మిగిలివున్న ఒక్కొక్కరికి 5 కి. బియ్యం కూడా అందలేదు. స్వచ్ఛంద సంస్థలవారు కొంత తోడ్పడుతున్నారు. తమవారు అందరూ చనిపోగా మిగిలినవారు మానసికంగా బాగా దెబ్బతిని ఉన్నారు.

ద్వారక నుండి మేము ఇరాల చేరుకున్నాం- ఇళ్లు ఏవీ మిగల్లేదు- దేవాలయం కూలి గోడలు మిగిలి ఉన్నాయి. ఇక్కడ యిళ్ల చుట్టూ ఉన్న ఇంగ్లీషు తుమ్మలు పీరిపాలిటి 'ఉచ్చులు' (death traps) గా మారాయి. ఇలా మేము చాలా గ్రామాల్లో చూశాము- వరదరాగా పరుగెత్తబోయిన వారు తుమ్మల్లో చిక్కుకొని ఉక్కిరిబిక్కిరై ప్రాణాలు వదిలారు- ముఖ్యంగా స్త్రీలు. ఇప్పటికీ తుమ్మలనిండా చీరెలు, తలవెంట్రు కలు తెరల్లాగా వేలాడుతున్నాయి. గాలికి ఊగుతూ చూడ వచ్చినవారికి ఏదో విషాదం

చెప్పబోతున్నట్టు. ఇక్కడ సుమారు 850 మందిలో సగానికి పైగా చనిపోయారు. 'నా' అనేవాళ్ళు లేకుండా పోయిన స్త్రీలు 12 గురు. తలిదండ్రులను పోగొట్టుకున్న పిల్లలు ఏనమండుగురు. గంజాల అరిసవేణి అనే యువతి ప్రసవించి 12 రోజులే అయింది (వరద వచ్చిన నాటికి). వరదరాగా యింటివారి నందరినీ యింటి పైకప్పుకి చేర్చిన భర్త గంజాల సుబ్బారావు అలసిపోయి వరదనీళ్ళు తాగి తన యెదుటనే మునిగి పోయాడు. పదేళ్ళ, నాలుగేళ్ల తన యిద్దరి కొడుకులూ చూస్తుండగానే వరదలో కలిసి పోయారు. 12 రోజుల పాపతో యింటి కప్పుని కరుచుకొని ఉండగా రెండవ వరద తాకిడికి కప్పు ఊడి నీళ్లలో తేలిపోసాగింది. కొంత దూరం వెళ్లాక కప్పు మూడు ముక్కలుగా విడిపోయి, పాప కూడా చేతినుండి జారిపోయింది. ఇంతలో ఆమె చేతికి ఒక దూలం అందింది. 3 కోసుల దూరం కొట్టుకుపోయి ఒక చెట్టుకు చిక్కుకొని బతి కింది. ఆమె శూన్యంలోకి చూస్తూ తన గాథ చెప్పింది. తన కళ్లముందే ఉక్కిరి బిక్కిరై మునిగిపోయిన తన భర్త కోసం, పాప కోసం, పిల్లల కోసం ఆక్రోశిస్తున్న గుండెకాయలా కనిపించిందామె. ఉప్పెన ముంచిపోయిన నేలలాగా ఆమె ముఖం. శూన్యంలోకి చూస్తున్న కళ్ళలో కన్నీరు లేదు. "నేనెవరికోసం బతకాలి బాబూ" అంటున్నాయి ఆమె పెదాలు.

బరువైన గుండెలతో మేము యిక్కడినుంచి గొల్లపాలెం బయలుదేరాం. గొల్ల పాలెంకు సరియైన దారిలేదు. దారిలో రెండుచోట్ల కాలవలు. ప్యాంట్లు విడిచి డ్రాయర్ల మీద వెళ్లాం. సముద్రానికి సమీపంలోఉన్న యీ గ్రామం చాలా వెనుకబడిన ప్రాంతం. 4 వందలకి పైగా జనం, విపరీతమైన పశు నష్టం జరిగింది. మేము వెళ్ళిన నాటికి (21-12-77) గవర్నమెంటు వాళ్ళుగాని, ప్రైవేటు సంస్థలుగాని గొల్లపాలెం వెళ్లలేదు. కోడూరుకుగాని, ద్వారక రోడ్డుమీదికి గాని గొల్లపాలెం వాళ్లను పిలిచి కొంత సహాయం చేశారు. గవర్నమెంటు వాళ్ళు నెలరోజులలో ప్రతి యింటికి (యింట్లో ఎంత మంది ఉన్నా) 16 కి. బియ్యం, 1 జత గుడ్డలు యిచ్చారు. రాజమండ్రి రామకృష్ణ మిషన్ వారు దుప్పటి, ట్రంకు, లాంతరు ప్రతి యింటికి యిచ్చారు. ప్రభుత్వం యిక ఏమీ సహాయం చేయదు, పనులు చేసుక బతకండి అంటున్నారు అధికారులు. "అన్నీ పోగొట్టుకున్న మాకు ఏం పనులున్నాయి బాబూ చేసుకోవడానికి?" ప్రజల గోడు. గొల్లపాలెం రైతు కూలీలు కోడూరునుండి బియ్యం, కిరసనాయిలు అధిక ధరలకి కొని తెచ్చుకుంటున్నారు. ఓలేటి నాంచారయ్య 12 ఏళ్ల కుర్రవాడు. తల్లితండ్రి, ఇద్దరు అన్నలు, వదినలు, చెల్లెలు పోగా తానొక్కడే మిగిలాడు. ఈ వూళ్లో పొలాల్లో దిక్కు లేకుండా పడిఉన్న 7 శవాలని చూశాం. ఈ వ్యవస్థ క్రౌర్యంచేసిన నంతకాల్లాగా,

భూమికి దిగేసిన సిలువల్లాగా నేలను కరచుకొని 7 శవాలు– ఇదే ఊళ్లో జ్వరంతో చొణికిపోతున్న యిద్దరు పిల్లలు కనబడ్డారు. ఒక గ్రామస్తుడు తన పిల్లవాడిని భుజాన వేసుకొని పోతూ "మందుబిళ్ల లేమైనా ఉన్నాయా బాబూ" అని మమ్మల్ని అడిగాడు– మా టీం డాక్టర్ కోడూరులో చికిత్స చేస్తున్నారు. వరదవచ్చి నెలరోజులైనా ప్రభుత్వ డాక్టర్లు ఎవ్వరూ గొల్లపాలెం వెళ్లలేదు– ఎవరి కేదివచ్చినా కోడూరు (8 మైళ్లు) వెళ్ల వలసిందే–

మేము మరునాడు కొన్ని గ్రామాలు చూసి కోడూరు వెళ్ళుతుండగా విజయవాడకు చెందిన ఖాదీబోర్డు ఉద్యోగుల సహాయక బృందం ఒకటి కనిపించింది– వాళ్ళకి జీపు ఉంది– వాళ్లూ కోడూరే వెళ్లుతున్నట్టు తెలిసి కాలినడకన 15 మైళ్లు తిరిగి అలిసిపోయిన మేము 'లిఫ్ట్' అడిగాము– వాళ్లు ఒప్పుకున్నారు– జీపులో కోడూరు వెళ్లు తున్నాం– మాటల సందర్భంలో "గొల్లపాలెంకి ఏ సహాయమూ అందడంలేదు– అక్కడికి ఎవ్వరూ వెళ్లడంలేదు– అక్కడ పొలాల్లో 7 శవాలు పడివున్నాయి" అన్నాం. ఆ బృందంలో ఒక వ్యక్తి చుర్రున లేచాడు– "I don't believe (నేను నమ్మను) Govt. officials have touched every corner (ప్రభుత్వ ఆఫీసర్లు అన్ని మూల లకూ వెళ్లారు) they are doing excellent job (వాళ్లు అద్భుతంగా పనిచేస్తున్నారు) మీరు ప్రభుత్వాన్ని అప్రతిష్ఠపాలు చేద్దామనుకుంటున్నారు" అన్నాడు. 'మా కెమె రాలో శవాల ఫోటోలున్నాయి– కావలిస్తే గొల్లపాలెం పదండి' అన్నాం మేము. I don't believe' అంటూ ఆగ్రహోదగ్రుడయ్యాడు ఆ గాంధేయుడు– "నేను కను క్కుంటాను ఇది చాలా serious matter" అంటూ ఏదో గొణుక్కున్నాడు– కనులముందు కనిపించే వాస్తవాన్ని ఒప్పుకోకుండా ప్రభుత్వం డబ్బా వాయిస్తున్న పెద్దమనిషి.

గొల్లపాలెం నుండి బసవన్న పాలెం, ఊటగుండం వెళ్లాం– ఇవి సముద్రానికి చాలా దగ్గరి గ్రామాలు. ఉప్పెన మొదటి దెబ్బకే సర్వనాశన మైనాయి. బసవన్న పాలెం మొత్తం యిళ్లు కనిపించకుండా పోయినవి. ఊటగుండంలో ఒకటి రెండు పెంకుటిళ్లు మిగిలాయి. రెండు గ్రామాల్లో కలిసి బహు కొద్దిమంది మిగిలారు. ప్రభుత్వం ప్రకటించుకొన్నట్లు విమానం నుండి యిక్కడ పొట్లాలు పడవేయలేదు.

22–12–77 న భావదేవరపల్లి వెళ్లినాం. మంత్రిగారి గ్రామం కాబట్టి సహాయం బాగానే అందుతున్నట్లు అనిపిస్తున్నది. మంత్రిగారి గోడౌన్‌లు నిండుగానే ఉన్నాయట. అందే సహాయంలో అధికభాగం కాపులూ, పెత్తందార్లూ కాజేస్తున్నారు. ఇక్కడ కాపు లదే రాజ్యం– హరిజనులపై వీరి దౌర్జన్యం మాటల్లో చెప్పలేం– హరిజనులు తమకు

రావలసిన సహాయాన్ని, హక్కులను అడిగితే కాపులు మీదపడి తంతారు. హరిజన వాడ ఎవరో అసహ్యించుకొని ఊరికి దూరంగా విసిరేసిన పెంటకుప్పలా, దుఃఖానికి మారు పేరుగా చుట్టూ ముండ్ల పొదలతో– ఇప్పుడక్కడ ఏమీ మిగలలేదు అంతా పీనుగుల పెంట– ఒక్కచోట 70 మందిని పూడ్చిపెట్టారు. డిశంబర్ 22న కూడా యింకా 3 శవాలు తాటి తోపులో పడివున్నాయి. సరిగా పూడ్చలేదేమో ఒకచోట శవం కాళ్లూ చేతులూ బయటికివెళ్లి ఉన్నాయి. కొందరు చెట్లమీద ఎక్కి బతికారు. వరదవస్తుం దని ముందే హెచ్చరిక ఉంటే చాలామంది బతికేవారు. చాలామంది కాపులకి ఆశ్రయ మిచ్చిన భావన్నారాయణస్వామి (గుడి) హరిజనులకి అందుబాటులోలేదు. బడి కొంద రిని కాపాడింది. పల్లె ఇజ్రాయెల్ అనే యువకుడు అతని తమ్ముడు 40 మందిని హైస్కూలు కప్పు పైకిలాగి బతికించారు.

ఇదే హైస్కూలులో ఒక స్త్రీ పసిపాపను ఎత్తుకొని తలదాచుకొంది. వరదవచ్చి పాపను తన్నుకుపోయింది. రెండవ వరద తాకిడికి తాను వాలేసుకున్న బల్లతోసహా 3 మైళ్ళ దూరం కొట్టుకపోయింది– ఒక చెట్టుకు తగిలి బల్ల విడిపోయింది– బల్లమీది నుండి ఒక పాముపచ్చి ఆమె ముక్కుకి రెండుపైపులా కరిచింది. నీటిపాము కాబట్టి ఆమె చావలేదు. ఇంతలో ఒక వాసం దొరికి, అది ఒక చెట్టుకు తట్టుకోగా చెట్టు మీదనే తెల్లవారే వరకు బట్టలులేకుండా ఉండిపోయింది. శరీరం కొయ్యబారినట్లయింది. అతి కష్టంగా కిందికి దిగి తాటాకు కప్పుకుంది. ఆమె చుట్టూ 6 శవాలు కనిపించాయి. ముగ్గురు బతికి ఉన్నవారూ కనిపించారు. వారికీ కూడా బట్టలు లేవు. తాటాకులు కప్పుకొని తామెక్కడున్నారో తెలియక వెతుక్కుంటూ తిరిగి తిరిగి హరిజనపేట చేరారు.

పీనుగుల పెంటగా మారిన హరిజనపేటలోనే తమవారి సమాధుల మీదనే వారిని మళ్ళీ ఉండమని బెదిరించారు కాపులు. కాని హరిజనులు ఒప్పుకోలేదు. ప్రభు త్వంవారు వేరే చోటు చూపించారు. కాని అదీ ఊరి అవతలే.

ఇప్పటికీ భావదేవరపల్లిలో కాపుల దౌర్జన్యం పెత్తందారీ విధానం కొనసాగు తూనే ఉన్నది. కాపులు దారిన పోతుంటే హరిజనులు లేచి నిలబడాలి. ఎదురైతే పక్కకు తప్పుకోవాలి. మంచి బట్టలు వేసుకొని వూళ్లోకి వెళ్ళగూడదు. ఇవి పాటిం చకపోతే కాపులు మీదపడి తంతారు. అందమైన హరిజన అమ్మాయిలమీద ఏ కాపు కైనా కన్ను పడితే యిక వారి శీలానికి రక్షణలేదు. ఉప్పెనకన్నా ముందునాటి వరకు ఊళ్లో హోటలుకి హరిజనులని వెళ్ళనిచ్చేవారుకాదు. ఇప్పుడు కొందరు వెళ్లుతున్నారు. ఊళ్లో రెండు ఉన్నత ప్రాథమిక పాఠశాలలు– ప్రత్యేకంగా హరిజనులకి అని పేరు

లేకపోయినా అందులో ఒక దానికి కేవలం హరిజనులే వెళ్ళుతారు. రెండోదానికి మిగతా కులాలవారు. భావదేవరపల్లి దగ్గర పోటీపొద ఊరి చివర ఒక హరిజనుని గుడిసె ఉంది. భావదేవరపల్లి కాపులు రోజూ తాగడానికి వెళ్ళి వచ్చేటప్పుడు ఆ గుడిసెని బాదేవారు. ఆ బాధకు, భయానికి తట్టుకోలేక హరిజనుడు యిల్లువిడిచి పారిపోయాడు. ఇవన్నీ కట్టు కథలు కావు—భావదేవరపల్లిలో నడుస్తున్న చరిత్ర. చావగా మిగిలిన హరిజనులను కాపులు తాము పెట్టిన అప్పులు వెంటనే చెల్లించవలసిందని బాధిస్తున్నారు.

ఈమధ్య ఒక ఉపాధ్యాయ మిత్రుణ్ని ఒక విద్యార్థి యిలా ప్రశ్నించాడట— "ఏమండీ వరదలో అనేక గ్రామాలు కొట్టుకు పోయాయి కదా- మరి వాటి పునర్నిర్మాణం జరుగుతుంది- అయితే యీ పునర్నిర్మాణం వెనుకటిలాగే కులాల ప్రాతిపదికపై జరుగుతుందా? అంటే 'కమ్మరవీధి', 'బ్రాహ్మణవీధి' లాంటి కులాల వీధులు నిర్మిస్తారా? కులాల ప్రసక్తి లేకుండా అందరికీ కలిపి యిళ్లు నిర్మించే ఒక అవకాశం ఏర్పడింది కదా- అలా ఎందుకు చేయరు?—" ఆసక్తికరమైన యీ ప్రశ్న ఆ అధ్యాపకుని ఆలోచనల్లో పడవేసింది. కాని యీ దోపిడీ వ్యవస్థ కొనసాగినంత కాలమూ యీ కులాలూ, మతాలూ, యీ అంటరానితనం యీ హెచ్చు తగ్గులూ యిలా కొనసాగుతూనే ఉంటాయి— వ్యవస్థ మారనిదే మనిషికీ మనిషికీ మధ్య యినుపతెరలు తొలగిపోవని ఆ అధ్యాపక మిత్రునికీ తెలుసు.

తరువాత మేము మందపాకల చేరుకున్నాం. ఇది చాలా పల్లపు ప్రాంతం ప్రవాహం ప్రచండ వేగంతో 20 అడుగుల ఎత్తుగావచ్చినట్టు గుర్తులున్నాయి. ఎన్నో తాటి చెట్లు నేలకు పడిఉన్నాయి. ఉప్పెన బీభత్సం ప్రత్యక్షమౌతుంది. ఎందరో స్త్రీలు, పిల్లలు తమ ఆత్మీయులందరినీ కోల్పోయినవారు కనిపించారు.

జార్జిపేటలో, గొల్లలమోద లైట్‌హౌజ్ దగ్గర అలలు తాటి ప్రమాణంలో వచ్చాయని చెప్పుతున్నారు. ఉప్పెన నీటిపై ఎరుపు, పసుపుపచ్చ, ఆకుపచ్చ మిశ్రితమైన రంగు, ఒక విధమైన తెల్లని కాంతి కనిపించిందనీ, నీరు గోరువెచ్చగా ఉండెననీ చాలామంది చెప్పారు.

ఏమైనా జ్ఞాపకమున్నంతమేరకు యీ ఉప్పెన యీ శతాబ్దంలో యిటీవలి మానవ చరిత్రలో అత్యంత దారుణమైన సంఘటన.

తుఫాను బాధితులయెడ ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరి కూడా దారుణమైనదే.

30 ఏళ్ళ స్వాతంత్ర్యం తరువాత గూడా ఏటా తుఫానులవల్ల కోట్ల రూపాయల నష్టం జరుగుతున్నా, మన కోస్తా ప్రాంతాలను యింత వెనుకబడిన ప్రాంతాలుగా ఉంచటం క్షమించరాని నేరం.

ఈ దేశ సంపత్తి యావత్తు శ్రమజీవులదే. తుఫానులో అధికంగా ప్రాణాలను కోల్పోయింది శ్రమజీవులే. మరి తుఫాను బాధితులకు సహాయం అందించడంలో, పునరావాస సౌకర్యాలు కల్పించడంలో ప్రభుత్వం కనబరుస్తున్న నిర్లక్ష్యవైఖరి, జాప్యం, అహంకారం, దయతలుస్తున్నట్టు పోజుపెట్టడం దాని ప్రజావ్యతిరేక దోపిడీ స్వభావాన్నే బట్టబయలు చేస్తున్నవి.

వివిధ సంస్థల నుండి వస్తున్న సహాయం అర్హులైన వారిదాకా చేరకపోవడమో, అతిస్వల్పంగా చేరడమో జరుగుతున్నది. సమాధులమీద పునాదులు నిర్మించేవారు బయలుదేరారు. గ్రామాల్లో ప్రాబల్యం ఉన్నవారూ, మునసబులూ, అధికార్ల భాగస్వామ్యం, అండదండలతో అందుతున్న సహాయాన్ని స్వాహా చేయగలుగుతున్నారు.

పంపిణీవిధానం 'దాత-బిచ్చగాడు' పద్ధతిలో లోపభూయిష్టంగా ఉంది. సహాయం స్వీకరించే వారిలో యాచకప్రవృత్తిని, పరాధీన మనస్తత్వాన్ని, న్యూనతభావాన్ని దీనత్వాన్ని ప్రవేశపెట్టేవిగా మాత్రమే ఉన్నాయి తప్ప వారిలో ఆత్మవిశ్వాసాన్ని, క్రియాశీలతని, నిర్మాణాత్మక దృక్పథాన్ని కలిగించేదిగాలేదు. ఈ విషయంలో జె.ఎన్.యు. రాడికల్ స్టూడెంట్స్ సెంటర్, ఓ.పి.డి.ఆర్, దివి తాలూకా తుఫాను బాధితుల సహాయక కమిటీ వంటి కొన్ని స్వచ్ఛంద సంస్థలు తప్ప, ప్రభుత్వమూ కొన్ని స్వచ్ఛంద సంస్థలూ వ్యవహరించే తీరు బాధితులలో పరాధీన మనస్తత్వాన్ని దీనత్వాన్ని పోషించేదిగానే ఉంది.

ఈ సంస్థలన్నీ వెళ్ళిపోయిన తరువాత కూడా ప్రజలు ఎవరికోసమూ దీనంగా ఎదిరిచూడకుండా ఆత్మవిశ్వాసంతో పనులు చేసుకోగలగాలి. ఆ దృష్టితో బాధితుల్లో ఒకరుగా కృషిచేస్తున్నవి పైన పేర్కొన్న ఒకటిరెండు సంస్థలు మాత్రమే. కొన్ని సంస్థలు తమకి ప్రయోజనం, అభిరుచి వున్న ఏరియాలలోనే పనిచేస్తున్నాయి.

ఈ దేశసంపద యావత్తూ శ్రమజీవులదే. సామాన్యుల సొమ్ము, శ్రమజీవుల చెమట నెత్తురులు ఊపిరిగా నడిచే ప్రభుత్వం బాధితులమీద దయతలచేదేమీ లేదు. ఎవరి సహాయమూ అర్థించకుండానే వారికి పునరావాస, పునర్నిర్మాణ కార్యక్రమాలు చురుకుగా దోషరహితంగా చేపట్టవలసిన బాధ్యత, కర్తవ్యం ప్రభుత్వానిదే. అలాంటి సహాయం డిమాండ్‌చేసే హక్కు వరదబాధితులకుంది.

తక్షణ సహాయక చర్యలతోపాటు తీర ప్రాంతాలకు తుఫానులవల్ల నష్టం వాటిల్ల కుండా శాశ్వత ప్రయోజనాలు గల కార్యక్రమాలు చేపట్టాలి. తీరప్రాంతం పొడుగునా దృఢమైన కరకట్టలు (Dykes) నిర్మించాలి. తీరప్రాంత పల్లెకారులకు పక్కాయిళ్లు, కమ్యూనిటీ హాళ్లు రోడ్డుతోసహా అన్ని ఆధునిక సౌకర్యాలు కల్పించాలి. వరదల్లో విస్తారమైన ప్రాంతంలో పాడైపోయిన పంటకాలువలను, మురుగునీటి కాలవలను సత్వరమే బాగు చేయాలి.

ఇంతవరకు వరదబాధితుల కోసం రు. 30 కోట్లు ఖర్చుపెట్టినట్టు ప్రభుత్వం ప్రకటించింది. నిజంగా అర్హులైన హరిజనులు, జాలరులు రైతు కూలీ జనాలకు సక్రమంగా సహాయం అందనే లేదు. అధికార్ల అండదండలు భాగస్వామ్యం లేనిదే ప్రజాధనం యీ విధంగా దుర్వినియోగం కాదు.

సకాలంలో ప్రజల తుఫాను హెచ్చరికలు విని గూడా తీరప్రాంత రక్షణకోసం ఏ చర్యలూ తీసుకోకుండా ఎన్నికల బేరాలలో మునిగిన ప్రభుత్వం తుఫాను తరువాత వాళ్ళకి ఏదో ఒరగబెడుతుందనుకోవడం పొరపాటు.

తుఫానువల్ల జరిగిన విస్తారమైన నష్టాన్ని తాను ఒంటరిగా ఎదుర్కోజాలనని ప్రజల్నీ, విదేశాలనూ యాచిస్తూ ప్రభుత్వం తన నంగనాచి దివాళాకోరుతనాన్ని బయట పెడుతున్నది. విస్తారమైన నష్టం జరిగినమాట వాస్తవమే- కాని ప్రభుత్వం యీ సమస్యను ఎదుర్కో జాలదనడం అబద్ధం. ఈ సమస్యను ఎదుర్కోవడానికి కావలసిన వనరులూ, వసతులూ ఉన్నాయి- లేనిదల్లా చిత్తశుద్ధి, శ్రామికులయెడ సానుభూతి. తన ప్రజావ్యతిరేక దోపిడీ విధానాలను సవాల్ చేసిన విప్లవకారులను, రచయితలను కళాకారులను యింకా ఎందరెందరో యీ దేశ శ్రేయస్సు కోరినవారిని, వారి సాను భూతి పరులనూ అపారమైన తన గూఢచారి, పోలీసు మిలిట్రీ బలగాలతో ఏ మూలలో ఉన్నా వలపన్ని, వేటాడి, చంపి జైల్లోవేసి దారుణమైన అణచివేత చర్యలకు పాల్పడ గలిగిన ప్రభుత్వం అసమర్థమైన దేమీకాదు- గూఢచారి, పోలీసు ఆధునికీకరణకోసం ఆ సంబంధమైన యంత్రాంగ నిర్మాణంకోసం ఎన్ని కోట్లు ఖర్చు అవుతూఉంటాయి? దోపిడీవర్గాల కావలికుక్కగా వ్యవహరించే ప్రభుత్వం యీ వ్యవస్థను రక్షించడానికి ఎన్ని కోట్లయినా ఖర్చు చేయగలుగుతుంది- ఎంతో సమర్థవంతంగా పనిచేస్తుంది. కాని శ్రామికుల, బాధితుల శ్రేయస్సు వచ్చేసరికి అసహాయతా, అసమర్థతా ఎదురౌతాయి.

ప్రజల కోసం సమర్థవంతంగా పనిచేసే ప్రభుత్వం మనకి కావాలి- కావాలంటే యీ వ్యవస్థ మారాలి.

— లోచన్

# ఉప్పెనపై తొలి రిపోర్టు

పత్రికలలో, రేడియో వార్తల్లో విన్న దివిసీమ పరిస్థితిని పరిశీలించి, ఆ తుఫాను బాధితులకు ఎంతో కొంత సహాయం అందజేయాలనే ఉద్దేశంతో వరంగల్‌లో ప్రైవేటు ప్రాక్టీసు చేసుకుంటున్న మేము, మెడికల్ షాపుల నుండి అత్యవసర మందులు చందాలుగా స్వీకరించి అవనిగడ్డకు 24వ తేదీ ఉదయం చేరుకున్నాం. దారితెన్నులేక, ఎవరు సహాయం చేస్తారా అన్న ఆశతో 'దిక్కుమొక్కులేని జనం' ఆ ప్రాంతమంతా మాకు కనిపించారు. అక్కడే క్యాంపు చేస్తున్న డి.యం.ఒ. గారిని కలిసి మా ఉద్దేశం తెలియబరచి మా చేతనైన సహాయం చేస్తామని వివరించాము. కాని, ఆయన మాకు ఎలాంటి సలహా యివ్వక 'మీరు ఏదైనా చేయదల్చుకుంటే మీరే స్వయంగా నిర్వహించుకొనండ'ని అన్నారు. ఆరోజు రాష్ట్రపతి పర్యటన కార్యక్రమం వుంది కాబట్టి యీ తుఫాను సహాయక సిబ్బంది యావత్తూ ప్రజల పునరావాస కార్యక్రమాలకు స్వస్తి చెప్పి రాష్ట్రపతి స్వాగత సన్నాహాలు చేస్తున్నట్లు అక్కడ మేము గమనించాం.

చివరకు మేము ఇన్‌చార్జి డాక్టరు సహాయంతో కోడూరు మార్గంగా హరిపురం చేరుకున్నాం. అప్పటికి తుఫాను బీభత్సం జరిగి నాలుగు రోజులయింది. ఆ గ్రామాలకు అధికార, అనధికార బృందాలు వెళ్లనట్లు తెలుసుకున్నాం. ఆ ప్రాంతంలోని ప్రజలకు తాగేనీరు గాని, తినడానికి తిండిగాని అందలేదు. అక్కడి పేద ప్రజలు తమ బంధుమిత్రులను పోగొట్టుకొని అతి భయంకరమైన విషాద దృశ్యాల మధ్య, తుఫాను ఊడ్చుకుపోగా మిగిలిన కొద్దిపాటి వస్తువులను వదిలి రాలేక, ఆదుకొనే వారెవరూ లేరనే నిస్పృహతో, ఆర్తనాదాలతో కనిపించారు.

మేము హరిపురం వెళ్ళేముందు కోడూరు ప్రైమరీ హెల్త్ సెంటర్‌లో మెడికల్ ఆఫీసరును కలిసాము. ఆయన తనవద్ద కలరా నిరోధక మందుగాని, మంచినీళ్ళలో కలపడానికి బి హెచ్ సి పౌడర్‌గాని లేవని, అంతేకాక తనవద్ద పనిచేసే సిబ్బంది అంతా తుఫానుకు గురైనారని, వాళ్ళలో పనిచేసే స్థితిలో ఎవరూలేరని, అదనపు సిబ్బంది కొరకు డి ఎమ్ ఒ గారికి, కలెక్టరుగారికి లేఖలు రాసానని తన నిస్సహాయతను ప్రకటించారు. అప్పటి వరకు ఆయనకు ఆ అధికార్ల నుండి ఎలాంటి సమాధానమూలేదని కూడా అన్నారు. అంతకు అరగంట క్రితమే అక్కడకు చేరుకున్న విజయవాడ రోటరీ క్లబ్బు వారినుండి కలరా నిరోధక ఇంజక్షనులు తీసుకొని పని ప్రారంభించాం. ఆగ్రామాల ప్రజల గోడు వినడమే కాకుండా స్వయంగా చూశాం గనుక మావద్దవున్న మందులతో హరిపురంలోనే వైద్య శిబిరాన్ని తెరిచాము. 24, 25 రెండు రోజులు ఆ మూడు

గ్రామాలలో 600 పైగా కలరానిరోధక ఇంజెక్షన్‌లు యిచ్చాం. విరోచనాలు, వాంతులు అయ్యేవారికి చికిత్స జరిపి మందులు యిచ్చాం. అంతేకాకుండా ప్రత్యక్షంగా చూచిన దృశ్యాలను దృష్టిలో వుంచుకొని, పత్రికలలో వస్తున్న వార్తలు ఎంతవరకు వాస్తవాలు అనే అనుమానంతో శవాలను చూడాలని స్థానిక ప్రజల సహకారంతో ఆ ప్రాంత మంతా తిరిగాము, అక్కడ మేము చూసిన పదిహేను శవాలు భయంకరంగానూ జంతుకళేబరాలకీ, మానవ కళేబరాలకీ తేడా కనిపించనంతగా వాచిపోయి కుళ్లి వున్నాయి.

అవనిగడ్డలో మేం బయల్దేరిన దగ్గరినుండీ దారిపొడుగునా జంతువుల, మనుష్యుల శవాలే- చెడువాసన. అంతే ప్రయాణానికి సులువైన ప్రాంతాల్లోకూడా అప్పటి దాకా ప్రభుత్వం శవాలు తొలగించే ప్రయత్నం చేయలేదు. ఆ ప్రాంతంలో మాకు కనిపించిన ప్రజలు 'మా ఏడుపుల్లో మేముంటే, పోలీసుల బెదిరింపులు ఎక్కువైనాయ'ని, "రేపు మా డి ఐ జి గారు వస్తారు గనుక వారు వచ్చేలోగా మీరు ఈ శవాలను పూడ్చకపోతే మిమ్మల్ని పూడ్చుతామని డిఎస్పీ గారన్నార"ని చెప్పారు. వారికి 24వ తేదీ రాత్రి మనిషికి 120 గ్రాముల చొప్పున బియ్యం యిచ్చినట్లు, అవి కూడా కోడూరుకు వెళ్ళి అక్కడ పంపిణీ చేస్తున్న అధికారులతో అనధికారులతో పోట్లాడి తెచ్చుకున్నట్లు చెప్పారు. ఇచ్చే ఆ కొద్దిపాటి కోటానైనా యమయాతనలతో తెచ్చుకుంటున్నట్లు కనిపించింది. అనధికార బృందాలలో కూడ కొంతమంది తమ బంధువులకు, అనుకూలురకు మాత్రం రేషన్ యిస్తున్నట్లు మేం గ్రహించాం.

ఆ ప్రాంతాలలో చనిపోయినవారి వివరాలు ప్రత్యక్ష సాక్షులద్వారా తెల్సుకోగా, వారు చెప్పిన వివరాలనుబట్టి ఉల్లిపాలెం పంచాయితీలో 473 మంది (ఉల్లిపాలెం 53, హంసలదీవి 20, పాలకాయతిప్ప 400), గొల్లపాలెం పంచాయితీలో 1000 మంది చనిపోయినట్టు తెలిసింది. శ్రీరాంపురంలో చనిపోగా మిగిలిన 13 గ్గురు, ద్వారకలో మిగిలిన 10 మంది అవనిగడ్డ, కోడూరులలో వున్నట్టు తెలిసింది. గ్రామాలకు గ్రామాలు తుడుచుకుపోగా మిగిలిన పదిశాతం ప్రజలు కోడూరు, అవనిగడ్డలలో అందీఅందని సహాయంతో అలమటిస్తున్నారు. ఆ గ్రామాలు హంసలదీవి, బసవన్నపాలెం, ఇరాలి, ఊటగుండం, ద్వారక, శ్రీరాంపురం, వేణుగోపాలపురం, పాలకాయతిప్ప, మాలకాయలంక, కొత్తతుమ్మల పాలెం, జార్జిపేట, మిలిటరీ కాలనీ- పాదానవారిపాలెం, పోటుమీద, మందపాకల, పెదగొండ్లపాలెం మొదలయినవి. ఇక దివి తాలూకాలో చిన యాదర, సత్యనారాయణపురం, వాడపాలెం గ్రామాలలో మరణాలు 200 కు పైగా వున్నట్లు తెలిసింది. భవానీపురంలో 225 మందికి పైగా చనిపోయారు. అయా

ప్రాంతాల్లో చనిపోయినవారు చనిపోగా మిగిలిన వారినైనా రక్షించేందుకు ప్రభుత్వం సిద్ధంగా వున్నట్లు కనిపించలేదు.

మేము తిరిగిన కోడూరు, ఉల్లిపాలెం, గొల్లపాలెం పంచాయితీలలో ఒక్క స్వతం త్రపురంలో తప్ప మంచినీళ్ళు ఎక్కడాలేవు. హరిపురంలో ఉప్పునీటితో నిండిన బావుల నుండి నీటిని తోడుకొని శుభ్రపరచుకొని వుపయోగించుకుంటున్నారు. ఆ గ్రామంలో కొంతమంది చదువుకున్న యువకులు మృత కళేబరాలను, చేపలను పెద్ద పెద్ద గోతులుతీసి పూడ్చిపెడ్తుండగా మేము చూశాం.

ఈ పరిస్థితులన్నీ యిట్లావుంటే గోరుచుట్టుపై రోకటిపోటువలె దొంగల బెడద. దానితో మరింత భీతావహులై వున్నారక్కడి ప్రజలు. దింటిమెరక గ్రామంనుంచి కొట్టుకపోయిన బీరువాలు, మంచాలు, పెట్టెలు, నగలు, వంటసామాగ్రి ఎవరికి అంది నట్లు వారు దోచుకుపోయారని తెలిసింది. ఇందులో స్థానిక పోలీసుల పాత్ర కూడా లేకపోలేదని అక్కడి ప్రజలు అనుమానం ప్రకటించారు. "మంత్రిగారి వూరు, ఆ ప్రాంతాల్లోనే అధికారులూ, అనధికార బృందాలు అనేక సౌకర్యాలు కలిపిస్తున్నారు. మాపై కనీసం సానుభూతి కూడా తెలుపడంలేద"ని అక్కడి ప్రజలు వెలిబుచ్చిన మాటలు చేదు నిజాలని ఆయా ప్రాంతాలుతిరిగి, పరిశీలించి మేం తెలుసుకున్నాం. రిజర్వుపోలీసులు, శవాలను లాగేవారు, అధికారులు అంతా భావదేవరపల్లివెళ్ళి మంత్రి గారి మెప్పును పొందడానికి ప్రయత్నిస్తున్నారు తప్ప కోడూరు ఫిర్కావైపు వచ్చిన వారెవరూ లేరు. పర్యటన పేరుతో వస్తున్న వారిలో నిజాయితీగా ప్రజాసేవ చేయాలని వచ్చేవారు తప్ప అందరూ రోడ్డు బాగున్నంత వరకు కోడూరువైపు వచ్చి, ఆప్రాంతాన్ని చూసి యిక పైకి వెళ్ళడం సాధ్యం కాదని తమకి తాము సర్ది చెప్పుకుని తిరిగి పోయే వారే కనిపించారు. కొట్టుక పోగా మిగిలిన పంట నెలా దక్కించు కోవాలన్న అంచో ళనతో చిన్న, పెద్ద రైతులు కనిపించారు. మేము తిరిగిన ఏరియాలో సగటున ఎకరానికి 10, 15 బస్తాల ధాన్యం వస్తుందని విన్నాం, ఈప్రాంతంలో చనిపోగా మిగిలిన వ్యవసాయ కార్మికులు పనిచేసే స్థితిలో లేరు. తుఫాను షాక్‌నుండి తేరుకొనే సరికి ఒక సంవత్సరమైనా పడుతుంది. అంతవరకూ ప్రజాసేవకులుగానీ, ప్రభుత్వం కానీ ఆదుకోవాల్సిందేనని అక్కడి రైతులు అన్నారు. చనిపోయినవారిలో ఏభై శాతం పల్లెకారులు, 40 శాతం వ్యవసాయ కార్మికులు, మిగిలిన 10 శాతం రైతులు, అగ్ర కులాలవారు వున్నారు.

మేము అక్కడవున్న రెండు రోజుల్లో హెలికాప్టరుల నుండి భోజనపొట్లాలు గాని మంచినీటి సప్లయిగాని జరగలేదు. దినపత్రికల్లో హెలికాప్టర్ ద్వారా భోజన పొట్లాల

# ఉప్పెన ప్రాంతంలో వరంగల్ డాక్టర్లు

కోస్తా జిల్లాలను భయానక విషాదదృశ్యంగా మార్చిన ఉప్పెన, తుఫానుల గురించిన వార్తలు రేడియోలో విని, పత్రికల్లో చదివి తల్లడిల్లిపోయాం. మా ఆవేదనను అణచుకోలేక ఆ ప్రాంతాలకు వెళ్లి అక్కడి ప్రజలకు ఎంతోకొంత సేవచేయాలని నిర్ణయించుకున్నాం. కాని అటువంటి పరిస్థితుల్లో చిక్కుకున్న ప్రజలకు ఎలాంటి వైద్య అవసరాలుంటాయో మాకు తెలియదు. అందువల్ల ఒక సీనియర్ సర్జన్‌వద్దకు వెళ్ళి సలహా అడిగాం. ఇటువంటి విషాదంలో చిక్కుకున్న ప్రజల వివిధమైన అవసరాలను గురించి ఆయన మాకు వివరించి మమ్ములను జిల్లా అధికార్ల దగ్గరికి వెళ్లమన్నాడు. ప్రభుత్వం పంపిస్తున్న వైద్యదళాలతో మమ్ములను కూడ పంపించవచ్చునని సూచించాడు. కాని ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగంలో వుండే అశ్రద్ధ, జాప్యం గురించి మాకు తెలుసు గనుక మాఅంత మేమే వెళ్లాలనుకున్నాం. డబ్బు, మందులు కావాలి. వరంగల్, హనుమకొండలలో వున్న మెడికల్ షాపులకు మందుల విరాళం కోసం వెళ్లాం. మేమెక్కిన ప్రతి గడపా మా కెంతో ఆదరంతో మందులు యిచ్చింది. ఇక డబ్బు విషయంలో ఖర్చులన్నీ మేమే భరించుకోవాలనుకున్నాం.

ముగ్గురు డాక్టర్లం (మాలో ఒకరు లేడీ డాక్టరు) ఒక పౌరహక్కుల సంఘం బాధ్యుడు వెంటరాగా అవనిగడ్డకు నవంబర్ 24న చేరుకున్నాం. కాని మా దగ్గర కలరా యింజెక్షన్‌లు లేవు. అవి ప్రభుత్వం దగ్గర మాత్రమే వున్నాయి. బయట దొరకడంలేదు. స్థానికంగా వున్న యించార్జి ఆఫీసరు దగ్గరికి, మెడికల్ ఆఫీసరు దగ్గరికి వెళ్లి అడిగాం. వారి నుంచి ఎలాంటి ప్రోత్సాహమూలేదు. మాకు ఆ స్థలం కొత్తగనుక ఎటు వెళ్లాలనే విషయం అక్కడున్న ప్రజలనడిగాం. అత్యధికులు బాగా దెబ్బతిన్న ప్రాంతం కోడూరు అనీ, అక్కడికి సహాయం కూడా సరిగా అందడంలేదనీ చెప్పారు. చాలా దెబ్బతిని మా అవసరం ఎంతోవున్న ప్రాంతానికే వెళ్లాలన్నదే మా నిర్ణయం. కాని ప్రయాణ సౌకర్యాలు లేవు. ఎట్టకేలకు కోడూరు వెళ్లే జీపు మాకు

---

పంపిణీ జరిగిందనే వార్త చూసి ఆశ్చర్యపోయాం. అది శుద్ధ అబద్ధం. కోడూరు ఫిర్కాలో ఆ రెండు రోజులూ ఒక్క హెలికాప్టరూ తిరగలేదు. ఇక భోజన పొట్లా లెక్కడ? పత్రికలలో సహాయం చేస్తున్నట్లు వస్తున్న ప్రకటనలనుబట్టి చూస్తే ఆచరణలో మాత్రం అక్కడ ఆప్రజలకు అది అందడంలేదన్నది వాస్తవం. ఆకాశవాణి ద్వారా, పత్రికలద్వారా వస్తున్న యీ వార్తలనుబట్టి 'ఆ సహాయమంతా ఏమవుతున్నద'ని ఆ ప్రజలు మమ్మల్ని అడిగారు. ఒకవేళ సహాయం పైనుండి వస్తున్నా మధ్యదళారీలు, నాయకులు, అధికారులు కాజేస్తున్నారేమో అని కూడా అభిప్రాయపడ్డారు.

— చంద్ర

లిఫ్ట్ యిచ్చింది. కోడూరులో ప్రైమరీ హెల్త్ సెంటర్ వున్నది. అక్కడ కలరా యింజెక్షన్‌లు దొరుకుతాయని ఆశించాం. కాని అక్కడి మెడికల్ ఆఫీసరు తనవద్ద కూడా కలరా ఇంజెక్షన్‌లు లేవన్నాడు. తుఫాను, ఉప్పెన వచ్చిన నాలుగు రోజుల తర్వాత ప్రభుత్వ వైద్య సహాయాల పరిస్థితి యిది!

మేం కోడూరు చేరడానికి కొద్ది గంటల ముందుగానే విజయవాడ నుంచి డాక్టర్ వెంకటరత్నంగారు కొంతమంది డాక్టర్లను వెంటబెట్టుకొని వచ్చాడు. ఆయన కొన్ని కలరా ఇంజెక్షన్‌లు తెచ్చాడు. వాట్లోనుంచి కొన్ని మేం అడిగిందే ఆలస్యంయిచ్చాడు. వాటితో కోడూరుకు మైలు దూరంలోవున్న హరిపురంలో మేం వైద్యసేవ ప్రారంభించాం. హరిపురం, ఉల్లిపాలెం, స్వతంత్రపురం యింకా కొన్ని హరిజనవాడల్లో మేం పనిచేశాం.

ప్రజలు ఎంతచెప్పినా కలరా ఇంజెక్షన్‌లు తీసుకోవడం లేదని భయమో, అజ్ఞానమో వాళ్ళను రోగాలకు చావుకు గురిచేస్తుందనే ప్రభుత్వ ప్రచారం విని వున్నాం. కాని అక్కడ కలరా ఇంజెక్షన్‌లు తీసుకోవడానికి నిరాకరించిన ఒక్క మానవుడూ మా కంటబడలేదు.

మా పని సందర్భంగానూ, ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి వెళ్తున్నప్పుడూ మేం అసంఖ్యాకమైన మానవ కళేబరాలనూ, జంతు కళేబరాలనూ చూశాం. ఎక్కడబడితే అక్కడ రాసులుగా శవాలు కుళ్ళి కంపుగొట్టే దుర్భర వాసన. ప్రభుత్వం కనీసం సున్నపు నీళ్లు చల్లించినా యీ వాసన కాస్త అరికట్టబడి వుండేది. బ్లీచింగ్ పౌడర్ సంగతి చెప్పనక్కరలేదు.

మేమందరమూ ప్రైవేటు ప్రాక్టీషనర్ల మైనందున ఎక్కువ రోజులుండలేకపోయాం. బరువైన గుండెలతో నవంబర్ 28 న వెనక్కి తిరిగివచ్చాం.

వరంగల్ విప్లవ రచయితల సంఘం, పౌరహక్కుల సంఘం కొంత డబ్బూ, మందులు, బట్టలు సేకరించి ఉప్పెన ప్రాంతానికి వెళుతూ తమతోపాటు మమ్మల్నికూడా రమ్మన్నారు. ఈసారి ఒక డాక్టరు, లోగడ వెళ్లిన పౌరహక్కుల సంఘ బాధ్యుడూ, మరొక వెటర్నరీ డాక్టరు, ముగ్గురు లెక్చరర్లూ, విరసం వాళ్ళవెంట వున్నారు.

అది 17 డిసెంబర్ – అంటే మేం మొదటిసారి వెళ్లివచ్చి దాదాపు 20 రోజులై పోయిన తర్వాత. కాని అప్పటికీ యిప్పటికీ అక్కడి పరిస్థితులలో, దృశ్యాలలో మార్పేమీలేదు. ఎంతోమంది జనం ఎన్నో గాయాలతో బాధపడుతున్నారు – ముళ్ళు కుచ్చుకున్నవారు, ఉపరిశ్వాసకోశంలో నిమ్ము, క్రిములు చేరి బాధపడ్తున్నవాళ్లు, కండరాల నొప్పులతో, నీళ్లవిరేచనాలతో బాధపడ్తున్నవాళ్లూ ఎందరో కనిపించారు. కాని మా ఈ రెండవ పర్యటనలో మాకు షాక్ కలిగించిన విషయమేమిటంటే ధనుర్వాతానికి సంబంధించిన ఎన్నో కేసులు మావద్దకి వచ్చాయి.

20వ తేదీ ఉదయం నుంచీ కోడూరులో ఒ పి డి ఆర్ అప్పటికే నిర్వహిస్తున్న ఉచిత వైద్యశాలలో మేం పని ప్రారంభించాం. ఆ రాత్రి రెండున్నరకు ఒక ధను ర్వాతం కేసు వచ్చింది. అయన దింటిమెరక గ్రామానికి చెందిన పెద్దమనిషి రామ కోటయ్య— అవును, ధనుర్వాతం కేసు! స్థానికంగావున్న 'కేర్' వాళ్లను అతణ్ని అవనిగడ్డలోవున్న తాలూకా ఆసుపత్రి తీసుకవెళ్లడానికి కారు అడిగాం. మాలో ఒకరం వెంటవుండి అతణ్ని అవనిగడ్డకు తీసుకవెళ్లాం. కాని తాలూకా ఆసుపత్రిలో ధను ర్వాపం రోగులకు చికిత్సచేసే సౌకర్యంలేదు. ఉప్పెన ఉపద్రవానికి జనం గురియైన ప్రాంతానికి కేంద్రమది! అక్కడి డాక్టర్లు రోగిని మచిలీపట్నం జిల్లా ఆసుత్రికి తీసుక పొమ్మన్నారు— మేం వెంటనే మచిలీపట్నంవెళ్లి అక్కడ అతణ్ని ప్రభుత్వ జిల్లా ఆసు పత్రిలో వేశాం. నిజానికి అక్కడచూడా చోటులేదు— అక్కడ చోటు చేసుకొని వేశాం.

ఉప్పెన తర్వాత ధనుర్వాతం కేసులు ఆ ఆసుపత్రికి 24 వచ్చాయని అక్కడి అధికారులు చెప్పారు. ప్రజలకు యిక్కడ ఈ రోగమెందుకు వస్తున్నదని మేం ఆలోచనలో పడ్డాం. ఉప్పెన సందర్భంగా అయిన రకరకాల గాయాలు యిందుకు కారణమని తెసుకున్నాం. ముఖ్యంగా శవాలను తొలగించడంలో, పూడ్చడంలో, కాల్చ డంలో పాల్గొన్నవారు ఈ వ్యాధికి గురయ్యారు— రామకోటయ్య ధనుర్వాతానికి కారణ మిదే. దింటిమెరకలో శవాలను తొలగించడంలో ముందు నిలబడి చొరవతో పనిచేసిన కార్యకర్త రామకోటయ్య.

మచిలీపట్నం ఆసుపత్రిలో రామకోటయ్యగారు చనిపోయినట్లుగా 23-12-77 న విషాదవార్త వచ్చింది. క్షణకాలం కొయ్యబారిపొయ్యాం.

ఈ ఉప్పెన ప్రాంతాలంతటా వైద్యసేవ చేయడంలో ముందున్నది స్వచ్ఛంద సంస్థలే. ఒ పి డి ఆర్ క్లినిక్, ప్రజా వైద్యశాల, కేర్, జె ఎన్ యు మెడికల్ టీమ్ లాంటివి. ప్రభుత్వం బహుశా కలరా ఇనాక్యులేషన్ యివ్వడంతో తన పని అయి పోయిందని అనుకుంటుంది. ప్రజలందరికీ కలరా యినాక్యులేషన్ యిచ్చిన మాట నిజమే. కాని ఈ విషయంలో కూడ ఎక్కువ పనిచేసింది స్వచ్ఛంద సంస్థలే. అయితే ఎన్నో రకాల గాయాలకు, శ్వాసకోశ వ్యాధులకు— దగ్గు, పడిశం, వాంతులు, విరేచ నాల చికిత్స మాటేమిటి? ప్రజలను వాళ్ల కర్మకు వాళ్లను వదిలేయడమేనా? ప్రభుత్వ డాక్టర్లు ఎక్కడో అడవులలో 'ఎన్‌కౌంటర్'లలో కాల్చివేయబడినట్లుగా చెప్ప బడుతున్న నక్సలైట్ల శవాలను పోస్టుమార్టమ్ చేయడానికి కాకీబట్టల అఫీసర్ పిలుపుతో హుటాహుటీన పరుగెత్తడానికి సిద్ధంగా దొరుతుతారు తప్ప ఈ జీవచ్ఛవాల లాంటి ఉప్పెన బాధితుల సహాయానికి రాలేరా? వేలమంది నిరుద్యోగ వైద్య పట్టభద్రు లున్నారు— ప్రభుత్వం కనీసం కొన్ని నెలలపాటైనా యీ ప్రాంతంలో ప్రతి గ్రామంలో ఒక క్లినిక్ నిర్వహించలేదా? ఉప్పెనకు గురియైన 80 గ్రామాలలో 80 మంది డాక్ట

ర్లను, 80 మంది కాంపౌండర్‌లను నియమించడం కూడా యీ ప్రభుత్వానికి సాధ్యం కాదా? కల్లోలిత ప్రాంతాల పేరుతో ఏజెన్సీ ప్రాంతాలలో, గ్రామీణ ప్రాంతాలలో వేల సంఖ్యలో మిలిటరీ పోలీసు బలగాలను పెట్టగలిగిన ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్‌లో వైద్య సిబ్బంది లేకనేనా బంగ్లాదేశ్ నుంచీ, గుజరాత్ నుంచీ దూరదూరాల నుంచి వైద్య దళాలు రావలసివచ్చింది. ఎన్నో దేశాలు ఉదారంగా విరివిగా యిచ్చిన మందులన్నీ ఏమై పోయాయి? ఇవన్నీ ఈ వ్యాధిగ్రస్త వ్యవస్థ పీడనకు గురియవుతున్న ప్రజలు పులిమీది పుట్రలా వచ్చిపడిన ఉప్పెన ముప్పుకు లోనైనప్పుడు మనల్ని వేధిస్తున్న ప్రశ్నలు.

కోడూరులో నాలుగు రోజులపాటు వైద్యసేవ చేసి మేం 24న తిరిగివచ్చాం. 24న వరంగల్ నుంచే మరొకరు వెళ్లి 30 డిసెంబర్‌దాకా ఒ పి డి ఆర్ క్లినిక్‌ను నిర్వహించారు. జనవరి 1న మరిద్దరు డాక్టర్లు వెళ్ళారు. (ఆ రిపోర్టు యిదే సంచికలో చూడగలరు). తిరిగి 25 జనవరి నుంచి 30 దాకా వరంగల్ నుంచే మరియిద్దరు వెళ్ళి క్లినిక్‌ను నిర్వహించారు. అప్పటికి ఒ పి డి ఆర్ క్లినిక్‌లో మందులు కూడా లేవు. 30 జనవరిన యింక ఈ క్లినిక్‌ను నిర్వహించడం సాధ్యం కాక రవీందర్‌రావుగారు రాసిన వుత్తరంతో ఈ రిపోర్టును ముగిస్తున్నాము.

"ప్రజలకు అవసరమైన వేళ సేవచేసి మాతో సంఘీభావాన్ని ప్రదర్శించిన మీకు మా కమిటీ తరఫున ఒ పి డి ఆర్ తరఫున ధన్యవాదాలు.

ఇదివరలో కొన్నిసార్లు, యిప్పుడూ మేం ఈ క్లినిక్‌ను మందులు కొని నిర్వహించాల్సి వచ్చింది. స్థానిక ప్రభుత్వ ఆసుపత్రి నుంచి మందులు కావాలంటే కలెక్టరు అనుమతి కావాలని అక్కడి వాళ్లు చెప్పారు. అంటే ఆచరణలో దాని అర్థం సహాయ నిరాకరణ. అందువల్ల మేమింక ఈ క్లినిక్‌ను కొనసాగించే స్థితిలో లేం."

— డాక్టర్

కోడూరు ఒ పి డి ఆర్ క్లినిక్‌లోనూ, కోడూరు ఫిర్కాలోనూ వరంగల్ వైద్య బృందం పనిచేసిన వివరాలు :

1. నవంబర్ 23 నుంచి 27
2. డిసెంబర్ 18 నుంచి 24
3. డిసెంబర్ 24 నుంచి 30
4. జనవరి 1 నుంచి 4
5. జనవరి 25 నుంచి 30

# రోగుల దగ్గరికి వెళ్ళిన వైద్యులు

ఒ పి డి ఆర్ తుఫాను బాధితులకొరకై నిర్వహించే 'ఉచిత ప్రజావైద్యశాల'లో కొద్ది రోజులు పనిచేయడానికని వరంగల్లు నుండి వెళ్ళిన మూడవ డాక్టర్ల బృందంలో నేనూ ఒకడిని.

డిసెంబర్ 30 ఉదయం కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో నేనూ మరొక డాక్టర్ మిత్రుడూ కలిసి విజయవాడ వెళ్లేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయింది. కోడూరుకు వెళ్లే బస్సు గురించి విచారించాము. దివి తాలూకాలో విద్యార్థులు చేసే సమ్మె మూలంగా బస్సులు చల్లపల్లినుండే తిరిగి వస్తున్నాయని అవనిగడ్డ వరకు వెళ్లడంలేదని తెలిసింది. కొన్ని తుఫాను ప్రాంతాలలో స్కూలు ఫీజు మాఫీచేసినట్లుగానే, మిగతా ఉప్పెన ప్రాంతాల్లో ఫీజులు మాఫీ చేయాలని విద్యార్థులు సమ్మె చేస్తున్నారట.

చల్లపల్లి చేరింతరువాత, అవనిగడ్డ విషయం ఆలోచించవచ్చని బస్సు ఎక్కాము. విజయవాడ నుండి చల్లపల్లి చేరేసరికి సా॥ 5 గం. అయింది. అక్కడ నుండి అవని గడ్డకు బస్సులు లేవని, ఏమైనా లారీలు దొరికితే వెళ్ళవచ్చని చెప్పారు.

అసలు సమ్మె చేస్తున్నది విద్యార్థులు కారట— దివి తాలూకాలో తుఫానుకు సర్వ స్వము కోల్పోయిన నిర్భాగ్యులు— తమ రేషన్‌లు పెంచాలని, ఇంకా కొద్ది రోజులు ఉచిత భోజన, వసతి సదుపాయాలు కల్పించాలని పెద్దఎత్తున అవనిగడ్డలో ఆందోళన చేస్తున్నారట. అప్పటికే రేషన్ల పంపిణీ ఆపుచేయడం జరిగిందట.

ఎలాగైతేనేం ఒక లారీలో అవనిగడ్డకు దారిపట్టాము. అదే లారీలో అవనిగడ్డ తదితర గ్రామాలకువెళ్ళే జనాభా 60, 70 మంది ఉన్నారు. మా ఉత్సుకతను చంపుకో లేక ప్రక్కనేఉన్న ఒక వ్యక్తిని తుఫానువల్ల మీకేమైనా నష్టంకలిగిందా అని అడిగాము. ఆయన మమ్మల్ని తెల్లబోయి చూశాడు. మా ప్రశ్న అతనికి చాలా వింతగొల్పిందేమో 'మీరేదేశం నుండి వస్తున్నారు' అని అడిగాడు. తనవారంటూ ఎవరూ మిగలని పరి స్థితులలో, చల్లపల్లిలో ఉన్న తన బంధువుల ఇంటికి వచ్చి, అవనిగడ్డకు తిరిగి వెళ్తు న్నాడట. ఆ తుఫాను కాళరాత్రిలో ఒక చంకలో తన 3 ఏండ్ల కొడుకును, రెండవ చంకలో తన 2 ఏండ్ల బిడ్డను వేసుకొని, ఆ వరదలో తన వూరు దాటి రెండు మైళ్లు కొట్టుకొనివస్తూ దారిలో తన కళ్ళముందే జారి, నీటిలో మునిగి అమ్మా అని అరుచు కుంటూ ప్రాణాలు వదిలిన బిడ్డలను చూసి, ఏమీచేయలేని నిస్సహాయతతో ఒక చెట్టుకు పట్టి, ప్రాణాలు దక్కించుకున్నానని చెప్పాడు. తన భార్య ఏడాది చంటిపిల్లతో ఉప్పె నలో ఊరు దాటకముందే ప్రాణాలు విడిచిన విషయాన్ని చెప్పాడు. తనవూరు దింటి మెరక అని, చనిపోయిన వారికి ఇచ్చే పరిహారం నిమిత్తం అవనిగడ్డకు వెళ్తున్నానని

చెపుతూ తన ఇంట్లో కేవలం ఇద్దరే చనిపోయినట్లుగా లెక్కచూపి, సగం డబ్బే అంద జేస్తున్నట్లుగా తెలిపాడు. తనకు మూడు రోజులనుండి రేషన్ అందడంలేదని, తనీ పరిస్థితిలో సర్కారువారు పనిచేసుకొని బతకమంటే, ఎలా చేసుకోగలనని గద్గదస్వరంతో చెప్పాడు. ముద్ద నోటిలో పెట్టుకుంటే ఉప్పెనలో కొట్టుకుపోతూ విలవిల్లాడి ప్రాణాలు విడిచిన తన పిల్లలే గుర్తుకువస్తున్నారని రోదించాడు. ఇలాంటి కడుపుకోతలో, మాన సిక వ్యథతో మేమెలా పనులకెళ్ళగలమని ఎదురుప్రశ్న వేశాడు. ఇంతలో మా లారీ అవనిగడ్డ చేరడం, దిగండి దిగండి అనే డ్రైవరు కేకలతో, ఎక్కడో తపనగా ఆలోచి స్తున్న మేము ఉలిక్కిపడి గుండెభారంతో దిగాం.

కోడూరు చేరేసరికి 7-30 అయింది. అక్కడి నుండి ఒ పి డి ఆర్ నిర్వహించే ఉచిత ప్రజా వైద్యశాలకు వెళ్లాము. వారు మమ్మల్ని చాలా అప్యాయతతో ఆహ్వా నించి, అన్ని సౌకర్యములు కల్పించారు.

తెల్లవారి 8 గం॥ నుండి మా నిర్ణీత కార్యక్రమము ప్రారంభమైంది. 8 నుండి 12 గంటలవరకు రోగులను చూడటం, తరువాత భోజనానంతరము బయలుదేరి, సాయంతం 5 గం॥ వరకు చుట్టు గ్రామాలకెళ్లి వైద్యం చేయడం, మళ్లీ 5 నుండి రాత్రి 9 గం. వరకు కోడూరులో క్లినిక్ చూసుకోవడంగా నిర్ణయించుకొన్నాము.

మొదటి రోజున కాలినడకన దింటిమెరకకు వెళ్లాము. అప్పటికే అక్కడ ఒక వైద్య బృందం విడిదిచేసి వున్నది. వాళ్లు బొంబాయి నుండి వచ్చిన వైద్య బృంద మని తెలిసింది. వారితోపాటు అక్కడ ప్రజలకు వైద్యసేవచేసి 5 గం॥ కు తిరిగి కోడూరు చేరాము.

రెండవరోజు మధ్యాహ్నం సైకిళ్ళపై స్వతంత్రపురం, ఉల్లిపాలెంల మీదుగా హంసలదీవి చేరాము. ఈ మార్గమంతా చాలా భయానకంగా ఉన్నది. అక్కడక్కడా పొగలుచిమ్మే శ్మశానాలు, కళేబరాలనుండి వెలువడే దుర్గంధం, ఆ ఎగుడుదిగుడులలో కృష్ణానది ఒడ్డువెంట హంసలదీవి వరకు మా ప్రయాణం చాలా ఇబ్బందిగా సాగింది.

హంసలదీవి, కృష్ణానది ఒకపాయ, బంగాళాఖాతంలో కలిసే ప్రాంతంలోఉన్న ఒక చిన్న కుగ్రామం. అక్కడి ప్రజలలో అధికభాగం పల్లెకారులే. ఆ వూరిలోఉన్న కొన్ని పురాతన గోపురాలే, ఆ ఊరు సర్వనాశనం కాకుండా కాపాడినవి. అప్ప టికి 40 రోజులు దాటినప్పటికి ప్రభుత్వంవారి వైద్యసహాయం సరిగా అందలేదని చెప్పారు. అంతవరకు ప్రజలకు టి.టి. వ్యాక్సినేషన్ చేయలేదట. కలరావ్యాక్సి నేషన్ కూడా కొందరికి అందలేదని విని చాలా ఆశ్చర్యపడినాము. అప్పటికి మా వద్ద

ఉన్న 100 వ్యాక్సినేషన్‌లు అక్కడి ప్రజలకిచ్చి ఇంకా దగ్గు, జ్వరాలు, వాంతులు విరేచనాలతో బాధపడే రోగులను చూసి అతి చేరువలోనే ఉన్న పాలకాయతిప్పకు ప్రయాణం సాగించాము.

ఇక్కడ ఢిల్లీ జె ఎన్ యు నుండి ఉప్పెన బాధితుల పునరావాసం కొరకై అహో రాత్రులు పనిచేస్తున్న విద్యార్థులు కనిపించారు. వారిలో డాక్టర్ బల్జీత్‌సింగ్ (ఎం.డి.) రీసెర్చ్‌స్కాలర్‌ని మేము ఇంటర్వ్యూ చేశాము. ప్రభుత్వంచేసే సహాయ కార్యక్ర మాలకు ఒక నిర్దిష్టమైన, నిర్మాతణ్మాకమైన, ఆచరణయోగ్యమైన పద్ధతి లేదని ఆయన అభిప్రాయపడ్డాడు.

మూడవరోజున ద్వారక, ఊటగుండం, బసవడిపాలెం వరకు వెళ్లాము. బసవడి పాలెంలో మిగిలిన కొద్ది మంది జనాభా దగ్గరలోనే ఒక చిన్న గుడారంలో తలదాచు కున్నారు. మేం వెళ్ళినపుడు నాలుగయిదు రోజుల నుంచి తీవ్రంగా వాంతులు, విరేచ నాలకు బాధపడే ఇద్దరు పిల్లలను మాకు చూపించారు. వాళ్లకు మా వద్దవున్న మందులు రెండు రోజుల వరకు సరిపడునట్లుగా యిచ్చి మిగతా కొందరు వృద్ధులను, మానసిక వ్యాకులతతో బాధపడుతున్న ప్రజలను పరీక్షించి మందులిచ్చాం.

మేమున్న మొదటి రెండు రోజులలో అవనిగడ్డలో ప్రజలు (స్త్రీలు, పిల్లలతో సహా) రేషన్‌లు పెంచమని, సహాయ కార్యక్రమాలు సత్వరము అందజేయమని, వేల సంఖ్యలో పెద్దఎత్తున నిరాహార దీక్షలు, ధర్నాలు జరిపి తమ కోర్కెలు సాధించుకున్నా రని తెలిసింది.

ముఖ్యంగా మేము ప్రతిరోజూ చూసే దాదాపు 200 మంది రోగులలో ఎక్కువగా Gastro-Enteritis (వాంతులు, విరేచనాలు) మరియు Depressive psychosis (తీవ్రమానసిక సంక్షోభం, వ్యాకులత) కేసులే కనిపించాయి. ఈ తుఫాను బాధితులకు, ఈ విధంగా బాధపడే అసంఖ్యాకమైన రోగులకు పెద్దఎత్తున దీర్ఘకాలిక సదుపాయాలు కల్పించి, మానసికంగా శారీరకంగా కృంగి, కృషించే ఆ నిర్భాగ్యులను అన్నివిధాలా ఆదుకోవడం ప్రభుత్వ నైతిక బాధ్యత. ఇప్పుడు ప్రభుత్వం చేపట్టిన సహాయ కార్యక్ర మాలు ఎందుకూ కొరగావు. మావద్దవున్న మందులు అయిపోయినందువల్ల మేం జన వరి 4న అవనిగడ్డకు వెళ్లి జిల్లా సహాయ వైద్యాధికారిని కలిసి మాకు కొన్ని మందులు అత్యవసరంగా కావాలని దరఖాస్తు ఇచ్చాం. అతడు వెంటనే మంజూరు చేస్తానని చెప్పాడు. కాని చివరకు వాళ్ళు పంపినవి కొన్ని ఎ పి సి, బి కాంప్లెక్సు గోలీలు మాత్రమే. ఇవి అక్కడ ఎక్కువగా వున్న వ్యాధులకు మాత్రం ఉపయోగపడేవి కావు.

అక్కడి నుంచి రేషన్ను గురించి ఆర్‌డివోకు దరఖాస్తు పెట్టాము. మేం వారంరోజుల రేషన్‌కోసం దరఖాస్తు పెట్టగా వాళ్ళు రెండు రోజులకు మంజూరు చేసారు. మిగతా రోజులు దివి తాలూకా తుఫాను బాధితుల సహాయక కమిటీయే మాకు భోజన వసతి కల్పించారు. జరుగుతున్న సహాయ కార్యక్రమాలు కూడా పక్షపాత ధోరణితో, విశృంఖలంగా సాగుతున్నట్లు అక్కడి ప్రజలు తెలియజేశారు. నిజంగా సర్వస్వమూ కోల్పోయిన వారికి అందవలసినంత అందకపోవడం, ఏమీ కోల్పోనివారికి, లేక కొద్దిగా నష్టపడినవారికి పుష్కలంగా రేషన్‌లు తదితర సదుపాయాలు అందటం విరివిగా కానవచ్చింది.

ఏమైనా దివి ప్రజలు తుఫానుకు ముందునాటి స్థితికి చేరాలంటే కొన్ని సంవత్సరాలైనా పడుతుందనటంలో సందేహం లేదు.

— వియూరావు

## తుఫాను బీభత్సం - సహాయోత్సవం

వానకు రుద్రాభిషేకాలూ, ఎండకు సూర్యాస్త్రవాలూ వల్లించే ఆకాశవాణి నవంబరు 17వ తేదీనుంచి తుఫాను హెచ్చరికలు చేస్తున్నా జనం అనుమానంగా, అమాయకంగా వార్తలవైపు చూశారు తప్ప నిజాన్నీ, ఆపదనూ గుర్తించి, తరుణోపాయాన్ని వెదుక్కోలేదు— అట్లా వెదుక్కోలేరుకూడా.

మామూల కుగ్రామాలకూ, పల్లెలకూ ఎన్నికల దుకాణాలు తెరవటానికీ, పోలింగు బూతులకు జనాన్ని రకరకాల వాహనాలపై చేరవేయటానికీ కదిలే అధికార యంత్రాంగాలు ప్రజల కష్టాలయెడా, సమస్యలయెడా— తూష్ణీభావం, నిర్లక్ష్యం వహించి ప్రజల్ని వారివారి పరిస్థితులకూ, భగవంతునికీ విడిచిపెట్టాయి. అట్లా తుఫాను చక్రబంధంలో జనానికి జనమే చిక్కుకుపోయారు.

19వ తేది ఉదయం నుంచే మొదలైన కుంభవృష్టి, గాలీ 20వ తేదీ ఉదయానికి చెట్లనూ, పూరిళ్లనూ, పెంకుటిళ్లనూ ధ్వంసంచేసి ప్రశాంతినొందిన ఫాసిజంలా నిశ్చలముద్ర దాల్చింది. చీరాల్లో ఒక్క పూరిల్లు కూడా మిగల్లేదు. చీరాల తాలూకా సముద్రతీరమైన కటారివారిపాలెం, టెంకాయచెట్టుపాలెం మొదలైన గ్రామాల్లో పల్లెకారుల గుడిశలు నేలమట్టమై, వారి జీవనోపాధికుపకరించే వలలూ, పడవలూ ఎందుకు కొరగాకుండా పోయాయి. అక్కాయపాలెం, తోటవారిపాలెం, పాపాయపాలెంలో గొర్రెలూ, మేకలూ ఎక్కువభాగం చనిపోయాయి. ఈ పూరిపాలెం నుండి చీరాల, జాండ్రపేట, వేటపాలెం, పందిళ్ళపల్లెవరకు గల చేనేత కార్మికుల మగ్గాలూ, నూలూ నాశనమయ్యాయి.

పర్చూరూ, ఇంకొల్లు చుట్టుపట్ల గ్రామాల్లో చేతికందొచ్చిన వరిపైరు నేలపాలయింది. ప్రత్తికాయలు రాలిపోయీ, పిగిలిపోయీ పంటపాడయింది. మిరప మట్టి గొట్టుకుపోయింది పొగాకు చిల్లులుపడి చీలికలుపడింది. గత రెండు సంవత్సరాల నుండీ వరదలకు పటపటలాడుతున్న రైతాంగం తుఫాను తాకిడికి కన్నీళ్లలో మునిగి తేలుతోంది. రెక్కలు ముక్కలుజేసుకు బతికే వ్యవసాయ కూలీల పరిస్థితి మరీ దయనీయంగా, దుర్భరంగా వుంది.

ఇటీవల ప్రభుత్వం- పడిన పూరిళ్ల కిచ్చిన 150 రూ॥లకు 100 తాటాకులకు 45 రూ॥లున్న యీ పరిస్థితిలో తాటాకులు, యింటి కాలభాగానికి కూడా రావు. వెదురు వాసాలూ, తాటి బద్దలూ అందిస్తానంటున్న ప్రభుత్వం వాటి ఊసే పట్టిచ్చుకోలేదు. కొందరు పూరిళ్లవాళ్లూ, సామానులు పోగొట్టుకున్న అద్దెకుండేవాళ్లూ మాకింకా సహాయమందలేదంటున్నారు. అక్కడక్కడా గ్రామాధికారులు 150 రూ॥ల్లోనే కొంత కైంకర్యం చేసుకున్నట్లు తెల్సింది.

మధ్యాహ్నం నుండి సాయంత్రిందాకా, జనాన్ని క్యూలో నిలబెట్టినా వారికి పంచింది ముక్కిపోయిన చక్కిలాలూ, రొట్టెలూ, పురుగులుపట్టిన మానెడేసి బియ్యం. ప్రజల్ని యుద్ధప్రాతిపదికమీద సంరక్షిస్తున్నానంటున్న ప్రభుత్వం, ప్రజారోగ్యంతో చెలగాటాలాడుతూ, వారి జీవితాలతో పరిశోధనలు చేస్తోంది. ఒకపక్క రోగాలు రాకుండా వైద్యబృందాలు తరలిస్తున్నానంటూ, మరోపక్క శవాలెత్తేది పోలీసులా, సైన్యమా అని సందిగ్ధంలో గింజుకులాడుతోంది, వస్త్రసహాయం కూడా ఏబైయేళ్లు పైబడ్డవాళ్ల కేనట- మిగిలినోళ్లింకా ముసిలోళ్లు కాలేదనా ?

చీరాల సముద్రతీర 'జాలరిపేట'లో ఒక ముసలమ్మను ఇల్లు కూలి, కల్గిన తీవ్రమైన గాయాలతో ప్రభుత్వాసుపత్రికి చేర్చగా చావుకు సిద్ధమయిందని ఆసుపత్రివారు చేర్చుకోలేదు- ప్రభుత్వాన్నడిగితే 'చస్తే కదా మేం సహాయ మిస్తానంద'న్నారు, ప్రభుత్వ సహాయోత్సవంలోని పాలకవర్గ స్వభావానికి, ప్రజల బాధలయెడ వారి అపహాస్య ధోరణికి యిదొక మచ్చుతునక.

రాష్ట్ర ప్రభుత్వమేంచేయటంలేదంటుంది కేంద్రప్రభుత్వం, కేంద్రం కదిలి రావటం లేదంటుంది క్రింది ప్రభుత్వం. ఒకటి పడిపోతే చాలనుకుంటోంది మరొకటీ, మరొకటి చీలిపోతే బాగుండునను కొంటుంది వేరొకటీ. ఈ రెంటికి తుఫాను పరిస్థితుల యెడా, సమస్యలయెడా వుంది వినోదమా, విహారమా అని సామాన్యుడాశ్చర్య పోతున్నాడు. ప్రభువుల్నే మించిన యింకో ప్రభుత్వాధికారి 'సహాయం యివ్వడందుకున్న

ట్లుగాదు, మాదేంపోయిందీ, యిదంతా యింతకింత మీమీద పడేదేగా తీస్కోం'డంటు న్నాట్ట! ఆహా! వక్రింగానన్నా ఎంత నిజం చెప్పాడు?

ఈ తుఫాను బీభత్సం క్రీనీడల్లో పాలకవర్గాల ఎన్నికల చదరంగాలూ— దొంగ కుస్తీపట్లూ బహిరంగమవుతున్నాయి. అత్తసొమ్ము అల్లుడు దానంచేసినట్లు ఎవరిసొమ్ము ఎవరికిస్తున్నారనేదే సమస్య. ఇంతటి విపత్కర పరిస్థితిలో సందట్లో సమారాధనల్లా ఎడంచేత్తో వరదబాధితులకు అన్నం పొట్లాలందిస్తున్న రోటరీలూ, లైన్సూ, రైసు మిల్లర్సూ, మార్వాడీ సేట్సూ, మర్చంట్స్ అసోసియేషన్లూ, కుడిచేత్తో చీకటి గదులకి సరుకుల్ని నెడ్తున్న దెందరికి తెలుసు? అప్పుడే ధరలు ఆకాశాని కంటుకుంటున్నా యంటే మూలం కుర్చీ కిందున్నట్టు సాటికుర్చీలే అంటున్నాయి.

ప్రజాప్రభుత్వాలు ప్రజల్నిగురించే ఆలోచిస్తాయి— ఆచరిస్తాయి. అట్లాకాని వెవ్వరివో ప్రజలే తెల్చుకుంటారు. అందుకని యీ తుఫాన్ దాడికి గురైన మన వేలాది సోదర ప్రజానీకాన్ని తక్షణ సహాయం హక్కుగా గుర్తించేట్లుచేసి వార్ని ముం దుండి నడపటం ప్రజాహితాభిలాషుల కర్తవ్యం. ఇవే మన డిమాండ్స్‌గా ముందుకు తీసుకుపోదాం.

1. సన్నకారు మధ్యతరగతి రైతుల భూమిశిస్తు మాఫీ చేయడమే గాకుండా, వారికి ఎరువులూ, విత్తనాలు రెండేళ్ల వరకు ఉచితంగా యివ్వాలి.
2. వలసల్లోనూ, ఇంటివద్దా చనిపోయిన వ్యవసాయ కూలీల కుటుంబాలకు రెండేసి వేల రూపాయలిస్తూ, వారికి పని చూపించాలి.
3. చేనేత కార్మికులకు మగ్గాలూ, నూలూ ఇతర వృత్తికారులకు పనిముట్లు ఉచితంగా యివ్వాలి.
4. శవాలు సముద్ర జలాల్లోకి ఇంకా వస్తుండగా జాలర్లు చేపలు పట్టడం మంచిది కాదు గనుక వారికి ఉచిత ధనసహాయం చేస్తూ వలలూ, పడవలూ కొనివ్వాలి.
5. తుఫాను ప్రాంతం యన్జీవోలకూ, ఉపాధ్యాయులకూ సీ. డీ. యివ్వాలి.
6. పశు నష్టాలకు పరిహారం యివ్వాలి.
7. సముద్ర తీర ప్రాంతాల్లో తుఫాను హెచ్చరిక కేంద్రాలుంచి, ప్రజల రక్షణకు సిబ్బందిని నియమించాలి,

— విప్లవ రచయితల సంఘం ప్రకాశం జిల్లా యూనిట్

## ఉప్పెన రిపోర్టుపై కొన్ని సూచనలు

యీ రోజునే 'సృజన' వచ్చింది. ఉప్పెనపై రిపోర్టు చూశాను. మొత్తం మీద మీరు సమస్యలను ఒక్కొక్కదానినే తీసుకొని ప్రజల భాషలోనే వాటికి సమాధానాన్నివ్వటం బాగుంది. కార్యకర్తల సమాధానాలు (చక్రవర్తి లాంటివాళ్లవి) వాళ్ల మాటల్లో పొందుపరచడం చాల బాగుంది.

అయితే, విఫలమైన ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు— అవి దీర్ఘకాలికమైనవిగానూ, మెటీరియల్‌గా సహాయపడేవిగానూ ఎలా వుంటే బాగుంటుందో కొంత సూచన ప్రాయంగా యిస్తే బాగుండేదనిపిస్తోంది.

రెండోది, 'బిచ్చమెత్తడానికి అలవాటు పడ్డార'నే ఆరోపణను, 'తుఫాను ముందుకన్న ఎన్నోరెట్లు ధనికులయ్యారర'నే ఆరోపణను యింకా సరైన సమాధానాలు ప్రజలనుంచి రాబట్టి యిస్తే బాగుంటుంది. అవి చాలా నీచమైన ఆరోపణలు. యీ సందర్భంలో యీ మధ్య బొంబాయినుంచి వచ్చిన ఒక లా కాలేజి విద్యార్థి అభిప్రాయం (కొద్దిరోజులే వున్నాడు) సహాయకారిగా వుంటుంది. ఆయన అంటాడు: "బాధితులకు వెంటనే పునరావాస సౌకర్యం కలిగించటంలో విఫలమైన ప్రభుత్వం, తమ పూర్వ జీవితాన్ని ప్రారంభించేలా చేయటంలో విఫలమైన ప్రభుత్వం, ఒక పద్ధతి, నిర్మాణం ప్రకారం ప్రజల్ని తమ జీవితాన్ని ప్రారంభించేలా చెయ్యకుండా, స్వచ్ఛంద సంస్థల నుంచి వచ్చే సహాయాన్ని సమన్వయ పద్ధతిలో ప్రజలకు అందించకుండా, ఏదో రాబోతోందని ప్రజలు ఒకరికోసం, ఎవరి సహాయంకోసమో ఎదురుచూసేలా చేస్తోంది' అని. అది ప్రజలు తమ కాళ్లమీద తాము నిలబడటానికి వీలులేకుండా, ఇతరులమీద ఆధారపడేట్లుగా వుండే లాగున చేయడమేనని' గూడ ఆ మిత్రుడు చెప్పాడు. యిలా అనేక నిర్దిష్ట సమస్యల విషయంలో స్పష్టమైన సమాధానాలు నిత్యం ప్రజలతో సంబంధంవున్న కార్యకర్తల, మిత్రుల వద్దనుండి మనకు తెలియగలవు.

అలాగే, మా కమిటీ విషయం కొంత పొరపాటు దొర్లింది. దానిని మీరు "గ్రామీణ పేదల సహాయ సంఘం" అన్నారు— అది కాదు. మా తాలూకా ఒ పి డి ఆర్ కమిటీనే విస్తృతపరచి, కొంతమంది 'గ్రామీణ పేదల సంఘం' వారినీ, మరికొంతమంది యితరులతో కమిటీలోనికి కోఆప్ట్ చేసుకొని "దివి తాలూకా తుఫాను బాధితుల సహాయక కమిటీ"గా ఏర్పాటు చేశాము. వ్యక్తిగతంగా గూడా నన్ను 'గ్రామీణ పేదల సంఘం'లో భాగంగా మీరు రెఫరెన్సు యిచ్చారు— అలాగాదు. హరిపురం శివలింగయ్యగారిని పొరపాటున 'శివనాగయ్య'గా రాశారు. వ్యక్తిగతమైన రెఫరెన్సుల కంటే, అంటే వ్యక్తులపేర్లు అనేకసార్లు వ్రాయటం తగ్గించితే బాగుంటుందనిపిస్తుంది. అంటే 'సమస్యలు — వాటి సమాధానా'ల్లో అవసరమైనా, అన్నిచోట్ల అవసరం కాదేమో—

యింకోటి– 68 పేజీ మొదటపేరాలో " 'పందికొక్కులు' నింపుకొన్న గోడౌన్‌లు చూడాలంటే భావదేవరపల్లికి" అనే దాంట్లోగూడ యింకో విషయం కలిపితే బాగుం డేది– అదేమంటే భావదేవరపల్లిలో గూడ పేదలకు, ముఖ్యంగా హరిజనులకు సహాయం అందలేదు. హరిజనులు ఆ గ్రామంలో యీనాటికీ 'అస్పృశ్యులే' అనేది జగమెరిగిన వాస్తవం.

యివన్నీ, మీరు వున్నకాలం కొద్ది అగుటవల్ల వచ్చిన పొరపాట్లనుకుంటాను. అయినా అవేమీ మొత్తంమీద మీ రిపోర్టు మెయిన్ యాస్పెక్ట్‌కు హానిచేయలేదు. ముఖ్యంగా "వాళ్ల ఆకలిమీద ఆడుకొంటున్నది యీ వ్యవస్థ, యీ ప్రభుత్వం" అన్నది యీ రిపోర్టుకు తలమానికం.

ఉప్పెనకు గురైన ప్రజల సమస్యలను మీరు బయటి ప్రపంచానికి యీ పత్రిక ద్వారా అందిస్తున్నందుకు మా కమిటీ తరఫున ధన్యవాదాలు.

అభినందనలతో–

13–1–78 – కె. రవీంద్రరావు

## సింగరేణి కాలరీస్ యాజమాన్యం వితరణలోని ఆంతర్యం?

నేడు కోస్తా ఆంధ్ర శోకసంతప్తమైయున్నది. తుఫాను కొన్ని వేల మందిని పొట్టనబెట్టుకొన్నది. చనిపోగా మిగిలిన వారికి ప్రపంచం నలుమూలల నుండి ఆర్థి కంగా, హార్దికంగా సహాయ సహకారాలు అందుతున్నాయి. కాగా మన దేశంలోని బడా పెట్టుబడిదారులు గమ్మునా వున్నారు. పాలకవర్గాలు నిర్లక్ష్యపైఖరిని ప్రదర్శిస్తూ, ఈ విపత్తును తమ రాజకీయ స్వార్థానికి ఉపయోగించుకోజూస్తున్నాయి, ఉపయోగిస్తు న్నాయి కూడా. కాని అందుతున్న అందజేస్తానన్న సహాయం బాధితులకు అందుతుందా? అనేది చాలమందిని కలవరపరుస్తున్న ప్రశ్న. ముఖ్యమంత్రి నిధుల దుర్వినియోగం గూర్చి హెచ్చరించడం, ఆ తర్వాత కొంతమంది అధికారులను సస్పెండ్ చేయటంపై అనుమానం నిజమని రుజువయింది.

అన్నిచోట్లలాగే సింగరేణి కాలరీస్ యాజమాన్యం వారు కూడా కార్మికులవద్ద నుండి ఒకరోజు వేతనం నిర్బంధంగా కట్ చేశారు. ఈ నిర్బంధ విధానం ప్రవేశ పెట్టడం ద్వారా కొంతమంది కార్మికులలో తుఫాను బాధితుల యెడల సానుభూతికి బదులు అసంతృప్తి ప్రబలే పరిస్థితిని ఈ కంపెనీ యాజమాన్యం కల్గిస్తోంది. వాస్తవా నికి విషయాన్ని నచ్చజెప్పటం ద్వారా ఎక్కువ సహాయం కార్మికుల నుండి పొందవచ్చు.

ప్రజా కమిటీలు, సంస్థలవారు మాత్రమే ఆ విధంగా చేయగలరు. అలా జరగనిదృష్ట్యా కార్మికులు సగం సంతోషంతో వున్నారు. కారణం బాధితులకు ఆ సహాయం అందుతుందా? అనే అనుమానం. అంతేగాక యాజమాన్యం కార్మికుల నుండి వసూలుచేసిన సొమ్మును తనపేరనే ఇస్తుంది కాని కార్మికులపేరుతో ఇవ్వదు. ఈ రెండు కారణాల దృష్ట్యా తమచేత, తమపేర అందివ్వలేకపోతున్నామే అన్న బాధ కార్మికులకువుంది.

ప్రభుత్వ వుద్యోగులకు కూడా ఒకరోజు వేతనం ఇవ్వాలని జి.వోలు వచ్చాయి. ఒక పాఠశాలలోని టీచర్ నిర్బంధంగా గవర్నమెంట్ పేర తానివ్వలేనని డి. ఇ. ఓ తో ఖచ్చితంగా చెప్పి తానే నేరుగా యాభై రూపాయలు అందజేశాడట.

"స్వచ్ఛంద సంస్థలకు ఇతరత్రా కమిటీలకు విరాళాలు ఇవ్వకూడద" ని సేవా భావం కల యువకులను నిర్వీర్యపరుస్తూ, నేరుగా ముఖ్యమంత్రి నిధికే డబ్బులు పంపాలని ఆకాశవాణి 'మాటామంతీ' కార్యక్రమంలో నొక్కిచెప్పింది. వీటన్నిటినీ పరిశీలించినట్లయితే ప్రభుత్వ కుటిల వైఖరి బోధపడటమే కాకుండా "అప్పపెట్టదు అడుక్కు తిననివ్వదు" అన్న చందంగా వున్నది. కాబట్టి బాధితులకు ప్రజలు సహాయం, ప్రజా కమిటీల ద్వారాకానీ, నేరుగా తామేకానీ, అందజేయటం వుత్తమమేగాక, బాధితులను నిజంగా ఆదుకొన్న వాళ్ళవుతారు. ప్రభుత్వ నిధులను కానీ, ఇంకా ఏ నిధులను కానీ, ఆదరించినా ప్రోత్సహించినా, మన సహాయం, ఏటిలో పిసికిన చింతపండై పోతుంది.

— కె. యం.

మందమర్రి కాలరీస్. ఆదిలాబాద్ జిల్లా

---


వి. బి. గద్దర్ పాటలు  వెల: **50** పైసలు

ఉప్పెన (డాన్సుపాట) కరువుపాట, లాల్ సలాం

ప్రచురణ: సృజన, హనుమకొండ, వరంగల్ – 506 001.

వివిధ రకముల సాహిత్యం మరియు

దిన, వార, పక్ష, మాస పత్రికల కొరకు

సమతా న్యూస్ ఏజన్సీ

(ఆటో స్టాండ్ ప్రక్కన)

చౌరస్తా, హన్మకొండను దర్శించండి

సమీక్ష :

## 'ప్రజల నుండి ప్రజలకు'

శ్రీరంజిల్లెడి తెలుగుదేశమీ
ఆంధ్రదేశము మనదీ
పాడిపంటకు సహజ సంపదకు
కొదవలేని సీమా
పోరాటాలకు, అనుభవాలకూ
అంతులేని సీమా

ఇలాంటి జీవగడ్డలో కోస్తా జిల్లాలైన కృష్ణా, గుంటూరు జిల్లాల్లో నవంబర్ 19, 1977న

భూమి ఆకసము వకటైనట్లుగా
కురువసాగెరా కుంభ వర్షము
కాలువలన్నీ కాల నాగులై
బుసబుస పొంగి బుసలుకొట్టెరా

'రక్కసి ఉప్పెన చక్కటి సీమను స్మశానవాటిక చేసింది'.

తుఫానుకు సంబంధించిన వార్తలను, గాథలను మనం ఎన్నో పత్రికల్లో చూశాం. కాని అక్కడి పరిస్థితుల్ని ప్రత్యక్షంగా చూసి శాస్త్రీయంగా విశ్లేషించి అక్కడ నిజంగా ఏం జరుగుతోంది, వరదబాధితులు ఏం కోరుతున్నారు, ఎలాంటి సహాయం వారికి అవసరం— మన కర్తవ్యాలేమిటి? ఇలాంటి వాస్తవ విషయాలు తెలియజేసినవారు బహు కొద్దిమంది.

హైదరాబాదు 'నవోదయ సాహితీ సాంస్కృతిక సంస్థ' వారు యిటీవల వెలువరించిన 'తుఫాను' బుర్రకథ యీ దృష్ట్యా ఒక మంచి ప్రయత్నం.

శ్రామిక జనానికి సులభంగా, ఉత్తేజకరంగా సామాజిక సమస్యలను వివరించడంలో తెలుగుదేశంలో 'బుర్ర కథ'కు ప్రత్యేకమైన స్థానముంది.

తుఫాను భీభత్సం, బాధితుల విషాద గాథలు వారి ఆవేదనా, కన్నీళ్లూ, ప్రభుత్వ నిర్లక్ష్యం, తుఫానువల్ల ఉత్పన్నమైన సమస్యలు, యీ సమస్యలను, ప్రజల నిస్సహాయ స్థితిని స్వార్థ రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకొనే ప్రభుత్వపు నీచ ప్రవృత్తి, సహాయం పేరిట గద్దలావచ్చి వాలిన 'కేర్' వంటి అమెరికన్ సంస్థల కుటిలనీతి, యింత కష్టంలోనూ యిటు ప్రకృతితో, అటు తమ హక్కులకోసం ప్రభుత్వంతో, అడుగడుగునా అన్యాయాలతో, అక్రమాలతో ప్రజల పోరాటం— అణగారిన ప్రజల సమరశీలం అద్దంలో కొండలా యీ 'తుఫాను' బుర్రకథలో మనకు కనబడ్డాయి.

"చాలా పెద్దఎత్తున తుఫాను వరద ప్రమాదం రాబోతోందని రెండు రోజులు ముందుగానే తెలిసినా ప్రభుత్వం గ్రామాలలో ఎందుకు దండోరా వేయించలేదు? నాయకుల మీటింగులకు కొన్ని గంటలలో వందల లారీల ఏర్పాటు చేసి వేలకివేల జనాన్ని తరలించే ప్రభుత్వం ప్రజలను సురక్షిత ప్రాంతాలకు ఎందుకు చేర్చలేదు?— 'ప్రజలను అణచటానికి' చెప్పకుండా, అడుగకుండాదిగే సైన్యం-ప్రజలను కాల్చటానికి పోలీసును, సైన్యాన్ని పంపే రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ప్రజల ప్రాణాలు కాపాడే విషయంలో 'నీవా నేనా' అని కొట్టుకున్నాయి"— యిలా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల ప్రజావ్యతిరేక స్వభావాన్ని రచయితలు 'బుర్ర కథ'లో బయటపెట్టారు— తుఫానువల్ల ఏర్పడ్డ దారుణపరిస్థితిని ఎన్నికల బేరాలకి అవి ఎలా ఉపయోగించుకున్నాయో తెలిపారు.

"భూస్వాములు, ప్రభుత్వం కుమ్మక్కయి, రేషనిస్తే కూలిజనం కోతకు రారని కుతంత్రాలు పన్నారు— రేషను ఆపుచేశారు" అంటాడు కథకుడు బుర్రకథలో ఒకచోట. అవును— 'పుణ్యానికి వచ్చే రేషనుకీ, యితర సహాయాలకీ అలవాటుపడి తాగి, సోమరులై పనులెగ్గొడుతున్నార'ని భూస్వాములూ, ప్రభుత్వమూ తుఫానులో చావగామిగిలిన వారిమీద ఒక అరోపణ చేశారు— కాని తమ కళ్లముందే తమ పిల్లల్నీ, తల్లుల్నీ, ఆత్మీయులందరినీ పోగొట్టుకుని, తినటానికి తిండీ, ఉండటానికి గూడూ లేక గుండె వికలమై మానసికంగా దెబ్బతినిపోయిన వారిమీద ఎంత క్రూరమైన, అమానుషమైన అభాండం! నిజానికి శ్రామికులైన ప్రజలెవ్వరూ ఎప్పుడూ పనులకు వెనుకాడరు— ఒళ్ళు దాచుకోరు— సంవత్సరం పొడుగునా రాత్రింబవళ్లు రెక్కలు విరుచుకొని, రక్తమాంసాలు కరిగేట్టు పనిచేసినా కాలే కడుపులకి వేడి గంజినీళ్లు కూడా దొరకవు.

"ప్రజలు తమ హక్కులు రక్షించుకోవాలంటే, తమ అవసరాలు తీరాలంటే, తమకు జరిగిన, జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కోవాలంటే తాము సంఘటితమై పోరాడాల్సిందే— పరిస్థితులే వారి కీవిషయం తెలుపుతాయి" అని బుర్రకథ గుర్తుచేస్తుంది— "ఉప్పెన పోరాటమే కాదు అన్ని రకాల దోపిడీని అంతమొందించడానికి, పీడితప్రజలు ఉప్పెనవలె ముందుకు వస్తారు" యీ విధంగా అన్ని కష్టాలకు మూలమైన యీ వ్యవస్థను కూలదోసి తమ రాజ్యాన్ని తెచ్చుకుంటారు" అంటూ కథ ఆశావహంగా ముగుస్తుంది.

ఇదివరకే తుఫాను ప్రాంతాల్లో, యితరచోట్ల కూడా విజయవంతంగా ప్రదర్శింపబడ్డ యీ బుర్రకథను 'ప్రజల నుండి ప్రజలకు' ప్రాతిపదికపై మరింత విస్తృత జనబాహుళ్యంలోకి తీసుకుపో సంకల్పించిన నవోదయ కార్యవర్గం కృషిలో నిజాయితీ కనబడుతోంది.

ఈ బుర్రకథ కొన్నిచోట్ల తుఫాను దృశ్యాలను కన్నులకు కట్టేదిగా, హృదయాన్ని పట్టుకునేదిగా ఉంది. అయితే కొన్నిచోట్ల రచన మామూలుగా, పేలవంగా కూడా నడుస్తుంది. తుఫానువల్ల ఉత్పన్నమైన మరికొన్ని సమస్యల్ని యీ బుర్రకథ స్పృశించకుండా వదిలేస్తుంది. ఉదాహరణకి: వరదల్లో గ్రామాలకు గ్రామాలే కుడిచి పెట్టుక పోయినయ్. తిరిగి అక్కడ ఏదో ఒక రూపంలో యిళ్ల నిర్మాణం జరుగుతోంది. హరిజన పేటలు మళ్ళీ ఊళ్ళకి దూరంగానే వెలుస్తున్నాయి. పూర్వంవలె కులాల వారీగా కాకుండా గ్రామాల్లో వాడలు అందరికీ కలిపి నిర్మించవచ్చు కదా. ఇప్పుడు అలాంటి ఒక అవకాశం ఉందికదా. అట్లా ఎందుకు చేయరు? ఈ కులాలు యీ విధంగా కొనసాగుతూ ఉండటానికి వెనక ఏ సామాజిక దుష్టశక్తి పనిచేస్తున్నది? నేటి వ్యవస్థకీ కులాలకీ ఎలాంటి సంబంధముంది. కులమత రహితమైన సమాజం సామ్యవాద వ్యవస్థలోనే ఎలాసాధ్యమో మొదలగు విషయాలను బుర్రకథలో స్పృశించవలసి ఉండాల్సింది.

వరదబాధితులకి రేషన్, గుడ్డలు, పాత్రలు మొదలగు వాని లోపభూయిష్టమైన పంపిణీ విధానం వారిలో ఆత్మవిశ్వాసం, నిర్మాణ దృక్పథం, స్వతంత్ర ప్రవృత్తికి బదులు యాచక మనస్తత్వాన్ని, అసహాయతను, లొంగుబాటును, దీనత్వాన్ని ఎలా ప్రవేశపెడుతున్నాయో, తమ శ్రమతో దేశ సంపత్తిని సృష్టించే వీరికి 'సహాయం' అనేది ముష్టి కాదనీ అది తమ హక్కనీ వారు భావించే ఆరోగ్యకరమైన పద్ధతిలో పంపిణీ జరగాలనే విషయం బుర్రకథలో నొక్కి చెప్పితే బాగుండేది. ఏమైనా ప్రజా కళాకారుల మార్గంలో 'తుఫాను బుర్రకథ' ఒక మంచిప్రయత్నం.

ఈ వ్యవస్థ దోపిడీ స్వభావాన్ని, దానికి రక్షణగావున్న ప్రభుత్వాన్ని ప్రజల ముందు ఎండగట్టి, శ్రామికజన రాజ్యం స్థాపించుకోవటం కోసం రచయితలూ, కళాకారులూ తమ కళల్ని ప్రజలు, ప్రజాపోరాటాలు గీటురాయిగా పదునుపెట్టుకోవాలి.

— లోచన్

---

వచ్చే సంచికలో....

అజ్ఞాత సూరీడు, నగ్నముని, సరోజ్‌దత్తా కవితలు

చదవండి! చదివించండి!!

ప్రజా పంథా 50 పైసలు

(మార్క్-సెల్డర్ 'విప్లవ చైనాలో యేనాన్ మార్గం' నుండి కొన్ని భాగాలు)

ప్రతులకు: సృజన, హనుమకొండ, వరంగల్ - 506 001.

ఇరికించబడిన కామ్రేడ్స్ గురియవుతున్న కష్టాలు నష్టాలు సంగతి అలావుంచి దాదాపు ఏభై లక్షల రూపాయలదాకా ప్రజా ధనాన్ని దీనిమీద ప్రభుత్వం వెచ్చించింది.

ఈ కేసులో సెషన్స్ కోర్టులో ప్రభుత్వ ప్రాసిక్యూటర్లుగా వుండే కనీసార్హత కూడా లేకుండా, ఇన్నేళ్లుగా వల్లూరి సత్యనారాయణరాజు, కె. వి. ఎల్. నరసింహారావుగార్లు కొనసాగారనే విషయం ఇప్పుడు హైకోర్టు తీర్పుతో బయటపడి ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. ఈ ఇద్దరూ సెషన్స్ కోర్టులో ప్రాసిక్యూటర్లుగా లీగల్‌గా పనికిరారనే విషయం ప్రభుత్వానికి తెలియంది కాదు, కాని నక్సలైట్ల పట్ల ఈ ఇద్దరికీ నరనరాన జీర్ణించిన వ్యతిరేకత, ద్వేషం మాత్రమే వీళ్లకీ రాజకీయార్హత నిచ్చిందనేది ఈ కేసుకు ఏ ఒక్కరోజు హాజరయిన వాళ్లకయినా తెలిసిందే. అది అలావుంచి ఈ తీర్పుతో ఈ కేసు మళ్లా విచారణ ప్రారంభదశకు వెళ్లుతుందేమోనన్న అనుమానం కూడ వేస్తున్నది.

రాజకీయ ఖైదీలందరినీ విడుదలచేసి, ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తారనే వాగ్దానంతో జనతాపార్టీ కేంద్రంలో అధికారానికి వచ్చింది. అదే జనతాపార్టీ ఇప్పుడు రాష్ట్రంలో ఎన్నికల సందర్భంగా ప్రకటించిన ప్రణాళికలో రాజకీయ ఖైదీలను విడుదల గురించి ప్రస్తావనైనా చేయలేదు.

అందువల్ల దేశవ్యాప్తంగావున్న ప్రజాతంత్రవాదులు, వామపక్షశక్తులు, రచయితలపై, మేధావులపై, రాజకీయ కార్యకర్తలపై మోపిన సికిందరాబాదు కుట్రకేసు లాంటి బనాయింపు కేసులను వెంటనే రద్దు చేయవలసిందిగా డిమాండ్ చేయాలని విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

కె. వి. రమణారెడ్డి
కార్యదర్శి
10-6-27, కావలి - 1.

హైదరాబాదు
26-1-1978


రాడికల్ స్టూడెంట్స్ యూనియన్
రాష్ట్ర మహాసభలు

ఫిబ్రవరి 18, 19 వరంగల్‌లో

విరివిగా విరాళాలు యిచ్చి, పాల్గొని
సహకరించి జయప్రదం చేయండి.

వరవరరావు
అధ్యక్షుడు

రవి
కార్యదర్శి

ఆహ్వాన సంఘం, వరంగల్.

SRJANA Telugu Monthly Feb. 78 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

# విరసం కార్యవర్గ తీర్మానాలు

## ఎన్నికల పట్ల విరసం వైఖరి

విరసం గతంలో ఎన్నికల బహిష్కరణ పిలుపు యిచ్చింది. ఆ అంశంపై ఈనాడు విరసంలో విభిన్న ధోరణులున్న దృష్ట్యా ఈ ఎన్నికలపై తమ అభిప్రాయాలను వ్యక్తంచేయటానికి, ఎన్నికల్లో తమ పాత్ర నిర్వహించడానికి సభ్యులకు స్వేఛ్ఛ యివ్వాలని విరసం కార్యవర్గం ఏకగ్రీవంగా తీర్మానించింది.

## రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి

గత మార్చి ఎన్నికల్లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తాననీ, రాజకీయ ఖైదీలందరినీ బేషరతుగా విడుదలచేస్తాననీ, రాజకీయవాదులపై ఇందిరా హయాంలో బనాయించిన కుట్ర కేసులతోసహా అన్ని కేసులు ఎత్తివేస్తాననీ జనతాపార్టీ వాగ్దానంచేసింది.

జనతాపార్టీ కేంద్రంలో అధికారంలోకి వచ్చి 10 మాసాలు జరిగినా రాజకీయ ఖైదీలందరూ బేషరతుగా విడుదల చేయబడలేదు. మీదుమిక్కిలి జనతాపార్టీ ప్రభుత్వాలున్న రాష్ట్రాల్లో కూడా— బీహార్‌లో 250, ఉత్తరప్రదేశ్‌లో 375 మంది, మార్క్సిస్టు పార్టీ నాయకత్వాన బెంగాల్‌లో ఏర్పడిన వామపక్ష ఐక్యసంఘటన ప్రభుత్వం కూడ ఇంకా 200 మంది రాజకీయ ఖైదీలను జైళ్ళలో అట్టిపెట్టి వుంచింది.

ఆంధ్రలో ప్రభుత్వం ఎన్నికలు ప్రకటించింది. 250 మందికి పైగా రాజకీయ నాయకులు ఇంకా జైళ్లలోవున్నారు. వందలాది మంది రాజకీయవాదులమీద వారెంట్లు అలాగే వున్నాయి. కుట్రకేసులు, ఇతర కేసుల తతంగం ఇంకా రాజకీయ వాదుల మీద కొనసాగుతూనేవుంది. శ్రీకాకుళం, గోదావరిలోయ ప్రాంతాల్లో సాయుధ పోలీసు శిబిరాలు ఉపసంహరించలేదు. రాజకీయవాదుల్ని జైళ్లలో పెట్టి, వారిపై కేసులు ఎత్తివేయకుండా, వారెంట్లు రద్దు చేయకుండా కల్లోలిత ప్రాంతాల ప్రకటన రద్దుచేసి, సాయుధపోలీసు శిబిరాలను ఉపసంహరించకుండా రాష్ట్రంలో స్వేఛ్ఛా వాతావరణంలో ఎన్నికలు జరుగలేవు. రాజకీయ వాదులందరికి స్వేఛ్ఛగా తమ అభిప్రాయాలు ఎన్నికల్లో ప్రకటించడానికి వీలుగా రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలనీ, వారెంట్లు రద్దుచేయాలనీ, కుట్రకేసులతో సహా అన్ని కేసులు ఎత్తివేయాలని, కల్లోలిత ప్రాంతాలప్రకటన రద్దుచేసి పోలీసుక్యాంపులు ఎత్తివేయాలని విరసం డిమాండ్‌చేస్తున్నది.

## సికిందరాబాదు కుట్రకేసు వెంటనే ఎత్తివేయాలి

ఆరుగురు విరసం రచయితలు యిరికించబడిన సికిందరాబాదు కుట్రకేసు కాలం ముందుకు జరిగినకొద్దీ వెనక్కిపోతూ దాదాపు నాలుగు సంవత్సరాలయింది. ఇందులో

—[మిగతా లోపలి కవర్‌లో]